త్రిశూలం-3

# వేటకుక్క

([illegible] సాహసాలు)

రచన

ఆరుద్ర

ఆరుద్ర ప్రచురణలు

1 శివప్రకాశ మొదలియార్ వీథి

మద్రాస్-17

మొదటి ముద్రణ :
ఏప్రిల్, 1958



వెల : 50 నయాపైసాలు.

ఈ నవలలోని పాత్రలు, సన్నివేశాలు, నామధేయాలు సంఘటనలు, అన్నీ కల్పితాలు. విగత సజీవ వ్యక్తులకు ఏ మాత్రం పోలికలున్నా అవి కేవలం యాదృచ్ఛికమే గాని ఉద్దేశ పూర్వకం కాదు.

ముద్రణ :

క్రాంతి ప్రెస్
12. ఫ్రాన్సిస్
జోసెఫ్ వీధి,
మద్రాసు—1.

ఇతర రచనలు :

త్వమేవాహం (కవిత)

గాథాలు గేయాలు ( ,, )

గ్రామాభ్యుదయం (నవల)

నేను చెప్పానుగా (కథలు)

ఊరుకుంటుంది ( ,, )

డిటెక్టివ్ నవలలు :

పలకల వెండిగ్లాసు

పయ్యాలకొంప

అనకట్ట పాదహత్య

అణాకాక స్టాంపు

చావుకు చాలా కారణాలు

ఆడదాని భార్య

అహింసా రౌడీ

రెండుగళ్ల ఆట

త్రిశూలం (మొదటిభాగం)

కొండచిలువ (త్రిశూలం-2)

# వేటకుక్క

ఆకలిగొన్న కొండచిలువ, ఆహారం కోసం వెతుక్కుంటున్నది, దిలీప్ చేతిని తన నోటితో గట్టిగా కరచి పట్టుకొని, అతని శరీరం చుట్టూ చుట్టుకొన ప్రారంభించింది.

పోలీసు దుస్తుల్లోనున్న సుబ్బారావూ, సత్యరాజూ చేరువ కావడం ప్రారంభించారు. వారు చెట్టుని ఆనుకొని పడిపోయిన దిలీప్‌నుగాని, అతణ్ణి చుట్టుకొంటున్న కొండచిలువనుగాని చూడనేలేదు. చెవులకు కర్ణకఠోరంగా వెర్రెక్కించే, కారు హారన్ మోతనే వారు కొద్దిసేపట్నుంచి వింటున్నారు కనుక, వారి దృష్టి ఆ కారుపైనే లగ్నమై, కాళ్ళు అటే వాళ్ళని నడిపిస్తున్నాయి.

పోలీసు వాళ్ళని అల్లంతదూరంలో చూసి, అమిత భయం చెంది, కాలికి బుద్ధి చెప్పిన చంచల పరిగెత్తి పారిపోవడం, సబ్ ఇన్‌స్పెక్టరు సత్యరాజు కళ్ళకి లీలగా

కనబడింది. అయినా అతడు కారు వద్దకే వెళ్ళాడు. సుబ్బారావు చంచలను చూడనేలేదు.

"సార్! ఎవరో అమ్మాయి పరిగెత్తి పారి పోతోంది" అన్నాడు సత్యరాజు.

"అయితే నువ్వెళ్ళి ఆమెని పట్టుకో!" అన్నాడు సుబ్బారావు, తాను పై అధికారినన్న భావం అవ్యక్తంగా ప్రదర్శిస్తూ.

సుబ్బారావు బర్తరఫ్ కాబడిన సంగతి సత్యరాజుకి తెలుసు. అయినా అధికారుల ఆజ్ఞ ప్రకారమే నడచుకొనడం అలవాటయిన సత్యరాజు తన స్వంత విచక్షణ పైన వ్యవహరించాలన్న సంగతి మరచిపోయి, సుబ్బారావుకి తాను చూసినది తెలియచేశాడు. మాజీ అధికారి మాటల ప్రకారమే చర్య తీసుకొనడానికి ఉపక్రమించాడు.

సుబ్బారావు కారును చేరుకున్నాడు. స్టీరింగు చక్రం పైన వాలిపోయి, హారన్ పైన పడిన భాస్కర్‌ని అతను, కాలరు పట్టుకొని లాగి సీటుపైన పడేటట్టు తోశాడు. అంతవరకు అవిరామంగా మ్రోత పెట్టిన హారన్ ఆగి పోయింది. సుబ్బారావుకీ, దూరంగా వెళుతున్న సత్యరాజుకి హృదయంపైన బరువు తీసేసినట్టనిపించింది. గట్టిగా మ్రోగుతున్న హారన్ ఎటువంటివాడికైనా గంగవెర్రులు పుట్టించగలదు. ఇంత బిగ్గరగానున్న హారన్ శబ్దమే కాదు, ఎంత చిన్న సవ్వడైనా, అంతు లేకుండా వినిపిస్తున్నప్పుడు, ఎవరికైనా చిరాకు పుట్టక తప్పదు. ఆ సవ్వడి ఆగిపోతే, భారం తొలగినట్టనిపిస్తుంది.

సుబ్బారావు, సీటుమీద పడేటట్టు తోసినా, భాస్కర్‌కు తెలివి రాలేదు. మరణించినవాడిలాగ

మైమరచి జ్ఞానేంద్రియాలు స్వాధీనంలో లేక పడు న్నాడు. సుబ్బారావు-భాస్కర్‌ను చూశాడు. ఈ దొంగ ముఖం సుబ్బారావులో ఏ విధమైన అనుభూతిని కలిగించలేదనడం తప్పు. అతనిలో నిరాశని రేకెత్తిం చింది.

కారును సమీపిస్తుండగా, ముఖం కనబడని వ్యక్తి బహుశా త్రిశూలం దొంగ కావచ్చునని, అతనే అయితే బాగుండునని, సుబ్బారావు భావించాడు. మరణకాలం ఆసన్నమైనప్పుడు, ఎక్కడ కెళ్ళి తల దాచుకున్నా మృత్యుదేవత నీడ మానవుణ్ణి వీడకుండా అనుసరించినట్టు ఈ త్రిశూలం దొంగ, తనను అనవ రతం అంటిపెట్టుకుని తిరుగుతాడనే భయపూరితమైన భావం సుబ్బారావు అంతరాంతరాల్లో లేకపోలేదు. తనకన్నా త్రిశూలం దొంగ మేధావి బలవంతుడు, జిత్తులమారి అనే విషయం కూడా సుబ్బారావుకి తెలుసు. అందుకే తనకి గుణపాఠం చెప్తానని బెదిరిం చిన వ్యక్తి ఈ నిర్జనసీమలో తనను అనుసరించి వచ్చా డేమో అనే బెరుకు కూడా అతనికి కలిగింది.

అయితే తానిప్పుడు, త్రిశూలం దొంగకన్నా బల వంతుడే. త్రిశూలం దొంగని పట్టుకోనమని నూప ర్నెంటు సత్యనారాయణ తనను ఆదేశించాడు. ఆ ఒక్కమాట, ఆ ఒక్క నిర్దేశం తనను బల సమన్వితుణ్ణి చేసింది. 'వాడుగాని దొరికితే...' అనుకున్నాడు సుబ్బారావు.

ఈ విధంగా సుబ్బారావు మనస్సులో గాలిమేడలు కట్టుకొంటున్నప్పుడు, ఏ దిలీప్ కోసం అతడు వేయి కన్నులతో, పదివేల ఆశలతో ఎదురు చూస్తున్నాడో ఆ దిలీప్‌కు అదృష్టవశాత్తు తెలివి వచ్చింది.

ఆపదలో ఉన్నప్పుడు మానవుడు అప్రయత్నం గానే దానినుండి తప్పించుకోవాలని ప్రయత్నిస్తాడు. గాఢనిద్రలో ఉన్న వ్యక్తి కాలుమీద చిన్న గుండు సూదితో గుచ్చినా చాలు, అప్రయత్నంగానే ఆ కాలిని అతడు పక్కకు తీసేసుకుంటాడు. అలాగే బలవంతమైన భయంకరమైన కొండచిలువ గట్టిగా తన చేతిని పట్టుకోసేసరికి, ఎవరో కనపడని దేవతలు, దిలీప్ మెదడును తట్టి 'నిజంకాని నిద్ర'నుంచి లేపారు.

కొండచిలువలు తాము భక్షించబోయే ప్రాణుల శరీరంలో ఒక భాగాన్ని ముందు నోటితో గట్టిగా పట్టుకొని ఆ తరవాత ప్రాణి శరీరాన్ని బిగువుగా చుట్టుకొంటాయనీ, పూర్తిగా చుట్టుకున్నాక తమ శరీరాన్ని ముడిచి, తమకి ఆహారం కాబోతున్న ప్రాణి ఎముకలని విరిచేస్తాయనీ, అంతతో ఆ ప్రాణి చని పోయి, దానిని కొండచిలువ కబళిస్తుందని ముందే చెప్పాము. మా పాఠకులకి తెలిసిన ఈ విషయం దిలీప్‌కు కూడా తెలుసు.

అయితే అతడు చెట్టుమ్రానుకు ఆనుకొని పడిఉన్న సంగతి, అతడి ప్రాణాన్ని కాపాడింది. చెట్టు మ్రాను చుట్టుకొలత మూడున్నర గజాలు. దిలీప్ ఛాతీ పద్దెనిమిది అంగుళాలు - అంటే అర గజము. అతడి చేయి ముంగుకు చాపబడివుంది. ఆ చేయి పొడుగు గజము. అతని మణికట్టుని నోటకరచి, ఛాతీమీదుగా ప్రాకి అతణ్ని చుట్టుకోవాలంటే, చెట్టునికూడా కలుపుకొని కొండచిలువ ఒక చుట్టుకు అయిదు గజాలు ఆక్రమించాలి. అయితే ఆ కొండచిలువ పొడుగుతొమ్మిది గజాలే. ఒక చుట్టు చుట్టుకున్నాక, రెండవ చుట్టుకు నాలుగు గజాలే మిగిలాయి. అది రెండవచుట్టు కూడా

గట్టిగా చుట్టుకొనకపోతే బలంగా అదుమలేదు. ఈ లోపమే దిలీప్‌ను కాపాడింది.

కొండచిలువల దవడలు సాగగలవు.అవి సాగి దిలీప్‌ను రెండవచుట్టు చుట్టుకొనేలోపునే అతనికి తెలివివచ్చి, దాని 'ధృతరాష్ట్రకౌగిలి' నుంచి 'ఉల్లాకపు పట్టు'నుంచి విముక్తి చెందడానికి ప్రయత్నించాడు. ఇతను ఇలా చావు బ్రతుకుల మధ్య సతమతమవుతుండగా, భాస్కర్‌ను సీటుమీద పడేయడం సుబ్బారావు పూర్తి చేశాడు. నిరాశతో తన దృష్టిని మరల్చుకున్నాడు. అప్పుడు, కొండచిలువ వాతబడుతున్న దిలీప్ అతని కళ్ళ బడ్డాడు.

ఆరిపోయిన లైట్లు మళ్ళా వెలగినట్టు, ఇంకిపోయిన నది భూగర్భంలోంచి పైకుబికినట్టు, పగిలిపోయిన జీవన పాత్ర పెంకులు, చెల్లాచెదురైనవి వాటంతట అవి గునగున నడిచివచ్చి ఒక దగ్గరచేరి, అతుకుకొని, ఆశ్చర్య జనకంగా పూర్వ స్వరూపాన్ని పొందడమే కాక, చేతిలోనికివచ్చి చేరినట్టు, సుబ్బారావులో ఆశలు ఒక్కసారి గుప్పుమన్నాయి. అంతేకాదు, కాగల కార్యం గంధర్వులే తీరుస్తున్నారన్న సంతోషం కూడా అతనిలో సాగరంలాగ ఉప్పొంగింది.

ఏ త్రిశూలం దొంగనైతే తాను పిస్తోలుతో కాల్చి చంపుదామని ఉవ్విళ్ళూరుతూ కుట్ర పన్నాడో ఆ దొంగ, అత్యంత ప్రమాదకర పరిస్థితిలో, సరీసృపానికి ఎరకాబోతూ కనబడితే. సుబ్బారావు ఎగిరి గంతేశాడు. తనకి పిస్తోలు పట్టుకొనే అధికారంలేదు, అందుచేత ఎలాగనైనా సత్యరాజుచేత కాల్పించాలనుకున్నాడు. అయితే ఇప్పుడా బెడదలేదు. 'త్రిశూలం గాణ్ని' పాపం! కొండచిలువ తినేసిందని మొసలి

కన్నీళ్లు కారుస్తూ, డి. యస్. పి. సత్యనారాయణకి విశ్వసనీయంగా చెప్పవచ్చు.

తెలివివచ్చిన దిలీప్ తెగించు కొండచిలువను వదిలించుకొనడానికి ప్రయత్నించినా, అది అతణ్ని విడచి పెట్టదలుచుకోలేదు. అతడు దాన్ని తోసేస్తున్నా, మళ్లా అది చుట్ట పెట్టుకొనడానికే ప్రయత్నిస్తున్నది. అతడి ఒకచేయి కొండచిలువ నోటికి తాకట్టు అయి పోయినా, రెండవచేయి విడిగా, అతని స్వాధీనంలోనే ఉంది. ఒక చేయికాదు, ఒక వ్రేలు ఖాళీగా ఉంటే దానితో అద్భుతాలు చేయగల అసమానశక్తి సామర్థ్యాలు దిలీప్‌కున్న సంగతి ఇప్పటికి మా పాఠకులకి తెలిసిన విషయమే. వేలు చూపెడితే మండని తిండిగా స్వీకరించగలవాడికి, సూదిమొనమేర ఆక్రమించుకోడానికి అవకాశం ఇస్తే ప్రపంచాధిపత్యాన్నే గుత్తకి తీసుకోగలిగిన ధీమంతుడికి, ఒక చేయి ఖాళీగా ఉన్నది కనుక ఏమాత్రం భయం జనించనేలేదు. తాను ప్రమానుకు అనుకున్న సంగతి గుర్తించుకొన్నాక ఇనుమిక్కిలి ఉత్సాహం కూడా వచ్చింది. ఈ కొండచిలువ తననేం చేయలేదనే ధైర్యం రెట్టింపయింది.

ఒకవంక కొండచిలువతో పోరుతూనే, దిలీప్ కారు వద్దనున్న సుబ్బారావుని చూశాడు. ఆ దుష్టుడు తన వైపుకే వస్తున్నాడని గుర్తించాడు. చూడగానే "హలో గుంటనక్కా! స్వాగతం సుస్వాగతం! నీ తమ్ముడితో కౌగణాంతరాలచేత కలబడుతున్నాను. దీని పీచమడంచాక, నీ సంగతి చూస్తాను. నీలాంటివాణ్ణి నిలబెట్టేసినందుకు మరోవిధంగా భావించి బాధపడకు" అని తన సహజ ధోరణిలో చెప్పి, దిలీప్ ఖాళీగా వున్న తన చేతితో కొండచిలువ తోకని పుచ్చుకొని గట్టిగా పట్టుకున్నాడు.

సాగాలని సంకల్పించుకున్న కొండచిలువ ఆశలు అందువల్ల కొనసాగలేదు. అది దిలీప్ చేతిని ఎంత గట్టిగా నోట కరిచిందో, అంతకు రెట్టింపు బలంతో పట్టు కారులాంటి పట్టుతో దిలీప్ దాని తోకని పట్టుకొని ఒక మెలి తిప్పాడు. అది గిజగిజ లాడింది. తన నోటి పట్టుని సడలించింది.

ఈ పట్టు సడలడమే కాక, సుబ్బారావు 'మనో నిబ్బరం' కూడా సడలింది. ఈ త్రిశూలం దొంగ దేవాంతకుడు. మృత్యుముఖంలో కూడా, చిద్విలాసంగా, చిరునవ్వుతో, చిలిపి సంభాషణ చేసేవాడు 'మానవ మాత్రుడు' కాడు. దిలీప్ వాక్యాలను విన్న సుబ్బారావు మరి ముందుకు సాగలేకపోయాడు. అడుగు తీసి అడుగు వేయలేకపోయాడు. ఆగి ఆశ్చర్యంతో అసమాన వ్యక్తి యొక్క పోరాటాన్ని కంటిరెప్ప వేయకుండా చూస్తూ బొమ్మలాగ నిలబడిపోయాడు.

"గుంటనక్కాజీ! ఈ కొండచిలువ నీ తమ్ముడని చెప్పినందుకు నువ్వు నివ్వెరపోయావని నేను గ్రహించుకున్నాను. పులి, పిల్లి ఒకే జాతివనీ, గుర్రం గాడిదా, ఒక కుటుంబంలోనివనీ, నరుడు, వానరుడూ, ఒక్క కోవ ప్రాణులనీ, జంతు శాస్త్రజ్ఞులు చెప్పడం మాత్రమే నీవు విన్నావు. అయితే కొండచిలువా, గుంటనక్కా ఒక తల్లి పిల్లలనే పరమసత్యాన్ని నేను రుజువు చేసి, ముక్త కంఠంతో ఘోషించి, లోకానికి చాటబోతున్నాను. ఇదుగో చూశావా! అందితే జుట్టు - అందకపోతే కాళ్ళూ పట్టుకొనే నీలాంటివాళ్ల స్వభావాన్నే ఈ కొండచిలువ కూడా ప్రదర్శించుతోంది. నా చేతిలో అది ఎలా గిజగిజ లాడుతోందో చూడు!" అన్నాడు దిలీప్.

సుబ్బారావు మారుమాట్లాడ లేదు. కొండచిలువ గిజగిజలాడినా దిలీప్‌కు ప్రమాదం తప్పలేదు. సరీసృపాలు ఒకసారి తమ ఆహారాన్ని నోట కరిచితే, వారి హరారాగులు దిగి వచ్చినా పట్టు విడువలేవు. ఆహారాన్ని కడుపులోనికి తీసుకొనడమే గాని బయటకు వదలిపెట్టడం వాటికి చేతకావు. ఎంత ప్రయత్నించినా విడువలేవు. ముందున్న కోరలు, వెనుకనున్న నాలుగు వరసల పళ్లు దిలీప్ చేతిని కరచిపట్టుకున్నవి సడలినా, కడుపులోనికి చేతిని లాక్కొనే ప్రయత్నానికే సడలినవి.

ఖాళీగా వున్న తన రెండవ చేత్తో దిలీప్ కొండ చిలువ నోటిని చీల్చాలనే తలంచాడు. అయితే చుట్ట బెట్టుకుంటున్న దానిని నిదుపు చేయడానికే దాని తోకని పట్టుకొని అదిమాడు. అయితే కుక్కతోక వంకర! ఎంత ప్రయత్నించినా తిన్నగవదు. అలాగే ఒక సారి వదలిపెట్టేస్తే మళ్లా ఆ తోక అతణ్ణి చుట్టబెట్టుకుందికే తిరుగుతుంది.

కొండచిలువల సంగతి ఒక్క దిలీప్‌కే కాదు, సుబ్బారావుకికూడా తెలుసు. కబళించదలచుకున్న ప్రాణిని ఒకసారి నోటకరిస్తే అది వదలిపెట్టదని తెలసిన సుబ్బారావు, దిలీప్ దాన్ని చీల్చి బయటపడకుండా కట్టుదిట్టం చేయాలని భావించాడు. తన పగవాడి అసమాన ధైర్య సాహసాలని వీక్షించాక, నోట మాటరానంత ఆశ్చర్యం కలిగినా వెంటనే సుబ్బారావు తేరుకొని తన కర్తవ్యాన్ని తనకు తాను జ్ఞాపకం చేసుకున్నాడు. 'ఎలాగైనా ఈ త్రిశూలంగాడు బయట పడకూడదు!' అదొక్కటే అతని ఆశయం!

"ఏం గుంటనక్కాజీ! చూశావా!" అని దిలీప్ హెచ్చరించాడు.

సుబ్బారావు వెంటనే జల్దుకున్నాడు. చంచల పార వేసిన కారు హేండిల్ అతని కాలికి తగిలింది. దానిని అతడు ఎత్తి పట్టుకున్నాడు. దిలీప్ కొండచిలువ తోకని విడిచిపెట్టినా, దాన్ని తన తొడకింద అదిమి పట్టాడు. అది వంకర తిరుగకుండా చేశాడు. ఇప్పుడు తన ఖాళీ చేత్తో, కొండచిలువ నోటిని చీల్చాలి.

"సుబ్బిగా! ఎత్తిన హేండిల్ దించకపోతే నీకు ప్రమాదం. ఇంకొక్క రెండు నిముషాలలో నీ అనుజుం డైన ఈ దుష్ట జీవనాన్ని చీల్చి చంపేస్తాను. ఆ తర వాత..."

"ఏడిశావు!" అన్నాడు సుబ్బారావు కసిగా.

"ఏడ్చువారు ధన్యులు, దేవుని రాజ్యము వారిదే! ఏ మిషనరీని అడిగినా ఈ సుభాషితం చెప్తాడు. అయితే నీలాంటివాడూ, నాలాంటివాడూ ఏడవరు. నేను పుట్టి నప్పుడు కూడా ఏడవలేదట. సంగీతకచేరీ చేస్తూ పుట్టా నట. నువ్వు బూతులు ఉచ్చరిస్తూ పుట్టుంటావు. ఏడ్పు అనే పదం మీద తీరుబాటుగా ఉపన్యసించి,అర్థం నీకు చెప్తాను" అన్నాడు దిలీప్.

"అఘోరిస్తావు! ఈ కొండచిలువ నిన్ను చుట్ట బెట్టుకొని నీ ఎముకలు విరిచేస్తుంది. ఎముకలు విరిగిన వాడు వెంటనే మరణిస్తాడు" అన్నాడు సుబ్బారావు, దిలీప్‌ను వాగ్ధోరణిలో అనుకరించాలని ప్రయత్నిస్తూ.

"భవదీయ ముఖారవిందం. అనగా నీ మొహం! ఈ కొండచిలువ నన్ను చుట్టుకోనలేదు. నేను చెట్టుని అనుకొని ఉన్నాను. నన్నూ చెట్టుని కలసి అది చుట్టుకోలేదు!" అన్నాడు దిలీప్.

'దొంగాడా! కరవకురా!' అని సామెత చెప్పినట్లు, చెప్పకూడని సంగతి చెప్పి, విరోధికి ఉపాయం తెలియ

చేసినట్టు దిలీప్ ప్రవర్తించాడే అని మా పాఠకులు నివ్వెరపోవచ్చు. గాని కావాలనే అతడు సుబ్బారావుకి ఈ సంగతి చెప్పాడని మనవి చేస్తున్నాము.

“ఓహో! అదా నీ ధీమా, నీ చావు ఇవాళ ఎలాగూ రూఢి. ఒకటే-ఈ కొండచిలువ నోట్లో చస్తావు. లేదా, నా చేతిలో చస్తావు” అన్నాడు సుబ్బారావు ముందు కొస్తూ.

“అది అక్షరాలా నీవు ఊహించవలసిన పద్ధతే! ఇద్దరూ అన్నదమ్ములేగా! ఎవరో ఒకరు విరోధిని చంపాలని జ్యేష్ఠుడు భావించడం భావ్యమే!”అన్నాడు దిలీప్.

సుబ్బారావు ముందుకొచ్చి, దిలీప్ కాళ్లు పట్టుకొని లాగాడు. అలా లాగిడంవల్ల చెట్టుకి ఆనుకున్న దిలీప్ భంగిమ మారవలసివచ్చింది. అతని వీపుకి చెట్టుకీ నాలు గంగుళాల మేర ఎడం ఏర్పడింది. ఈ ఎడంలో కొండచిలువ దూరి దిలీప్ వీపుని చుట్టుకోవాలని సుబ్బారావు యొక్క ఉద్దేశం.

దిలీప్ మళ్లా చెట్టుకి ఆనుకొనడానికి ప్రయత్నించకుండా చెయ్యాలని సుబ్బారావు-అతని కాళ్లని అలా పట్టుకొనే ఉండిపోయాడు. కాళ్లుగాని వదిలేస్తే వీపుకీ చెట్టుకీ ఎడం తగ్గిపోతుందని అతడు భావించాడు. అలా భావించడానికి దిలీప్ వీలుకలిగించాడు. ఏమంటే తాను చెట్టుని ఆనుకొని ప్రాణరక్షణ చేసుకొందామన్నట్టు పెనుగులాడాడు.

తన కాళ్లను గట్టిగా పట్టుకొన్న సుబ్బారావుని చూసి, ‘ఓహో! నువ్వూ కాళ్ల బేరానికే వచ్చావా? సరే-ఇలాగే కొద్దిసేపు నా పాదకమలముల సేవ చేశావంటే నీ పాపాలన్నీ పోతాయని కచ్చితంగ చెప్పగలను”

అని దిలీప్ తన తొడకింద అదిమి పట్టిన కొండచిలువ తోకని విడిచిపెట్టాడు. బాణంనుండి విడిచిపెట్టిన అమ్ములాగ, మూత తోస్తే కాగులోంచి వచ్చే ఆవిరిలాగ, పంజరం తెరిస్తే ఎగిరిపోయే పక్షిలాగ, ఆ తోక పైకెగసి, దిలీప్ కాళ్ళని పట్టుకొన్న సుబ్బారావు చేతుల్ని చుట్టుకొంది.

సుబ్బారావు చేతుల్ని కొండచిలువ చుట్టుకొనగానే దిలీప్, ఒక్కుమ్మడిన లేచి నిలుచున్నాడు. సుబ్బారావు కింద పడిపోయాడు. వెయ్యి పట్టుకార్లు ఒక్కసారి పట్టుకొని పీడిస్తే ఎంత బాధ కలుగుతుందో అంత బాధా సుబ్బారావు అనుభవించాడు. టన్ను బటవుతో కొండచిలువ అతడి చేతుల్ని అదిమి ఆ ఎముకల్ని విరిచేసింది. ఏ చేతులతో, ఇప్పుడు బర్తరఫ్ కాబడిన పోలీసు ఇన్‌స్పెక్టర్ సుబ్బారావు, పూర్వం చేయరాని దుష్కృత్యాలు చేశాడో, ఏ చేతులతో లంచం పుచ్చుకున్నాడో ఆ చేతులు శాశ్వతంగా ఇంక నిరుపయోగమైనాయని తెలియచేయడానికి మేము ఎంతైనా సంతోషిస్తున్నాము.

అప్పడాల సొంతిపైన అట్లు పెనం పడితే, పెళ పెళమని ఎలాగ అవి విరిగిపోతాయో అలాగ సుబ్బారావు చేతులు విరిగిపోయాక, దిలీప్ తన ఖాళీగానున్న చేతితో కొండచిలువ నోటిని పట్టుకొని బలంగా చీల్చాడు. అతనికి కొంచెం బాధాకరంగానే, ఆ దుష్టప్రాణి విడిపడ్డది. అయితే సుబ్బారావు అనుభవించుతున్న బాధ ముందు దిలీప్ బాధ సహస్రాంశం కూడా కాదు.

సుబ్బారావు తన జీవితంలో నేర్చుకున్న అసభ్యపద జాలాన్నంతా గుత్తళం కింద గుచ్చి, దిలీప్‌ని, కొండచిలువని వర్ణించుతూ, బాధపడుతూ ఏడవడం మొదలెట్టాడు.

"సుబ్బిగా! ఈ శ్రీమంతంబైన భరతఖండంలో నీ వెధవ స్నేహ వెధవచేష్టలు చూసినందుకు, దేవతలు పుష్పవర్షం కురిపించాలిగాని, వాళ్లు వేరే పనిమీద కారణాంతరాల చేత నిమగ్నులయి ఉండడంలో మరచిపోయారు. కనుక నేనే ఆ పూలవాన కురిపించదలచుకున్నాను" అని దిలీప్ ఒక చిన్న పూలమొక్క వద్దకు వెళ్లాడు.

కొండచిలువ కోరలూ, పళ్లూ నాటుకోవడంచేత, చిన్న చిన్న గాయాలయ్యాయి. వాటికి తక్షణం ప్రధమ చికిత్స చేయడం అత్యవసరం. ఈ అడవిలో అనేక రకాల మూలికలు, ఆకులు ఔషధానికి పనికివచ్చేవి అసంఖ్యాకంగా వున్నవి. ఆయుర్వేద శాస్త్రంలో అవసరమైనంత పరిచయంగల దిలీప్ కొండచిలువ కాట్లకు ఏ ఆకు రాస్తే చూస్తూ వుండగా నయమవుతుందో ఆ ఆకుల్ని కోసి, దూసి, తన చేతికి పూసుకున్నాడు. ఈ ఆకుల్ని కోస్తున్నప్పుడే అతను రెండు పూవుల్ని కూడా కోసి సుబ్బారావు కళ్ళముందు నేలరాల్చి, "పేదవాడికి పెళ్లామే భార్య అని పెద్దలు చెప్పినట్టు. ఈ రెండు పువ్వులే పుష్పవర్షమని భావించుకో. సత్యనారాయణ వ్రతంలో చెప్పినట్టు బంగారానికి గతిలేకపోతే వెండి, దానికీ గతిలేకపోతే తక్కువ రకం లోహంవాడినట్టు చాలా పువ్వులను వర్షించడానికి వీలు లేనప్పుడు రెండు పువ్వులతో సరిపెట్టుకోవడం శాస్త్రసమ్మతమే" అని దిలీప్ చేతులు దులుపుకొన్నాడు.

అప్పటికి పారిపోతున్న చంచలను పట్టుకొని, బేడీలు వేసిన సబ్ఇన్స్పెక్టర్ సత్యరాజు అక్కడికి వచ్చాడు. సుబ్బారావు రోదనంవిని ఆ యిద్దరూ నిర్ఘ్రమచెందారు.

"సార్! ఏం జరిగింది సార్, ఏమైంది సార్!" అంటూ ఆత్రుతగా సత్యరాజు సుబ్బారావుని ప్రశ్నించాడు.

"సత్యరాజుగారూ! జగత్తు స్తంభించి పోవలసి నంత ప్రమాదమేం జరగలేదు. గుంటనక్క గారు, తన తమ్ముడు కొండచిలువ వాతబడి చేతులు విరుచు కున్నారు" అన్నాడు దిలీప్.

దిలీప్ ఎవరో సత్యరాజుకి తెలియకపోయినా, సత్య రాజు సంగతి దిలీప్‌కు పూర్తిగా తెలుసు. ఈ అపరి చిత వ్యక్తి తనను పేరుపెట్టి పిలవడం సబ్ఇన్‌స్పెక్టరుకు ఆశ్చర్యం కలిగించింది.

"ఆశ్చర్యపడవలసిన అవసరంలేదు మహాశయా! కొండచిలువా, గుంటనక్క ఒకే జాతికుటుంబానికి చెందినవని నేను పరిశోధించే చెప్తున్నాను. ఇందాకా ఈ సంగతే శ్రీ సహిత సుబ్బారావుగారుగాడికి చెప్పాను. ఈ శాస్త్రరహస్యాన్ని చెప్పడానికి నాకేం అధికార ముందని మీరు భావించక్కర్లేదు. నేను జంతు శాస్త్ర జ్ఞుడ్నే! సుబ్బారావులాంటి జంతువులతో నాకు చాలా పరిచయముంది. అందుచేత నేను సదరు జంతుశాస్త్ర జ్ఞుణ్ణని ఏ విశ్వవిద్యాలయమైనా డాక్టరేట్ ఇవ్వ గలదు. నేను రాజకీయాల్లో ప్రవేశించి, ఒక మంత్రి పదవిని సంపాదించగానే కొండొక యూనివర్సిటీవారు ఆ పట్టాన్ని ప్రసాదించ దలచుకున్నారు. మంత్రులు కానివారికి గౌరవ పట్టాలను ఇవ్వకూడదనే శిక్షించని యూలు సాంప్రదాయంగా ఉండడంచేత ఇప్పుడే ఇవ్వ డానికి విశ్వవిద్యాలయంవారు తటపటాయిస్తున్నారు" అని దిలీప్ చెప్పాడు.

ఈ సత్యపూరితమైన ఉపన్యాసాన్ని సత్యరాజు సగం సగమే విన్నాడు. అతని దృష్టిపూర్తిగా సుబ్బా రావుపైనే ఉంది. 'ఆ బాధితుడికి ఎలాగ సహాయం చేయడం, అతని బాధని ఎలాగ తగ్గించడం' అని సబ్

ఇన్‌స్పెక్టర్ భావిస్తున్నాడు. అతడు సుబ్బారావు వద్దకు వెళ్ళి, మోకాళ్ళపై కూర్చొని బాధోపశమనానికి ప్రయత్నిస్తున్నాడు.

అది చూసి దిలీప్ "సబ్ ఇన్‌స్పెక్టర్ గారూ! చేతిలో ఉన్న ఒక పిట్ట- తుప్పలోనున్న రెండు పిట్టల విలువ చేస్తుందనే ఇంగ్లీషు సామెత తమకు తెలిసినదే అను కుంటాను. ఆ నానుడిని ఇక్కడ ఈ సందర్భంలో తారుమారు చేయాలి. సుబ్బారావు పక్షిగాణ్ని మీరు చేతిలోకి తీసుకొని, విచారించ ప్రయత్నించితే జక్కులదేవి జమీందారీ ఆభరణాలను అపహరించిన రెండు పిట్టలూ ఎగిరిపోయి. తుప్పలో దాక్కుంటాయి. అప్పుడు మీ చేతిలోనున్న పక్షిగాడు, ఆ రెండు పిట్టల ఎడమకాలి కొనగోటికి కూడా ఎందుకూ పోలడు. కావున నామాట విని ఈ సీతాకోక చిలుకనీ, ఆ కార్లో నున్న గబ్బిలాన్ని బంధించి పట్టుకుపొండి" అని దిలీప్ చెప్పాడు.

సబ్ ఇన్‌స్పెక్టర్ సత్యరాజు ఆలోచనలో పడ్డాడు. డి. యస్. పి సత్యనారాయణ తనను జక్కులదేవి ఆభర ణాలను అపహరించిన దొంగలని పట్టుకోనమనే ఆదే శించాడు. వాళ్ళను బంధించడమే తన తక్షణ కర్తవ్యం. అది చేయక, సుబ్బారావు గురించి పట్టించుకుంటే అధి కారులవల్ల మాట తప్పదు. అయినా బాధతో వున్న తోటి మానవుడికి సహాయం చేయాలనే కనీస ధర్మాన్ని అతడు విస్మరించలేనంత మానవత్వం గలవాడు - కనుక సంగిగ్ధావస్థలో పడ్డాడు.

"మరి ఈ సుబ్బారావుగారి సంగతి మీరు చూసు కుంటారా?" అని సత్యరాజు దిలీప్‌ను అడిగాడు.

"ఓ, తప్పకుండా చూసుకుంటాను. వీడిలాంటి

వాళ్ళ సంగతి చూసుకోనడమే నాకు నేను విధించు కున్న మొదటి డ్యూటీ" అన్నాడు దిలీప్.

జక్కులదీవి ఆభరణాల దొంగలను పట్టుకోనడానికే సత్యరాజు వచ్చినట్టు దిలీప్‌కు తెలుసనే అపోహలో మా పాఠకులు పడితే అది దిలీప్‌కు అమానుష శక్తులను అంట గట్టడమవుతుంది. అతడు మన అందరి మాదిరి మానవమాత్రుడే. అయితే సర్వమానవులూ సమానులే అయినా కొందరు మరికొంత సమానులు కనుక, దిలీప్ అసమానుడిలాగ కనబడతాడు. డి. యస్. పి సత్య నారాయణ ఫోనులో తనకు త్రిశూలం దొంగే రంగ నాయకుల్ని హత్య చేశాడని రేవనహోమం యిత్యాది వ్యక్తులు భావిస్తున్నారని చెప్పాడు; బహుశా ఈ సత్య రాజుకూడా త్రిశూలం దొంగనే పట్టుకోనడానికి ప్రయ త్నిస్తున్నాడేమో. సుబ్బారావు త్రిశూలం వ్యక్తి ఎవరో సత్యరాజుకి నోరుజారి చెప్పేలోగా సబ్‌ఇన్‌స్పెక్టర్ని అక్కడనుంచి పంపించి వేయడమే శ్రేయస్కరమని భావించి దిలీప్ జక్కులదీవి దొంగల సంగతిని ప్రస్తా వించాడు. అది ఒకందుకే కాదు-అన్నివిధాల మంచిదే అయింది.

దిలీప్, సత్యరాజుల సంభాషణను వింటున్న సుబ్బా రావు చేతులు విరిగిన బాధకన్నా ఎక్కువ బాధ పొందాడు. "వద్దు సత్యరాజూ! నన్ను విడిచిపెట్టి పోవద్దు. వీడు నన్ను చంపేస్తాడు. వదలిపెట్టి పోవద్దు" అని దీనంగా అరిచాడు.

"సత్యరాజుగారూ! నేను మంచి చీమలకైనా అప కారం చేయనివాణ్ణి. ఈ సుబ్బారావుని చంపవలసిన అవసరం నాకు లేదు" అన్నాడు దిలీప్.

ఈ సంభాషణ జరుగుతుండగా భాస్కర్‌కు తెలివి

వచ్చింది. అతడు తాను ఏ పరిసరాల్లో ఉన్నదీ, ఎట్టి పరిస్థితిలో ఉన్నది గ్రహించి, వెంటనే "శీఘ్రబుద్ధే పలాయనం" అని తలంచి పారిపోవడానికి కారు స్టార్టు చేశాడు.

ఆ సవ్వడి సత్యరాజు దృష్టిని సుబ్బారావు నుంచి మరలించింది. దిలీప్ ఒక్క దూకులో కారు వద్దకు వెళ్లి భాస్కర్‌ను డ్రైవర్ సీటునుంచి తప్పుకొనేటట్టు తోసేశాడు. భాస్కర్ అతడితో పెనగులాడ ప్రయత్నించాడు.

"చూశారా! సత్యరాజుగారూ ఈ తస్కర భాస్కరుడు తప్పించుకొని పోవడానికి ప్రయత్నిస్తున్నాడు. ఆలస్యం అమృతం విషం. వీడిని పట్టుకొని చంచల చేతికి వేసిన బేడీలలో ఒకదానిని తీసి, వీడి చేతికి తగిలించండి. దంపతులు కాని స్త్రీ పురుషుల చేతులు బేడీలతోనైనా కలుపడం పాప కార్యమని భావించకండి. వీళ్ళిద్దరూ ఒక్కటవుదామని ముచ్చటపడుతున్నారు. వాళ్ల కోరికను నెరవేర్చండి" అని చెపుతూ దిలీప్ భాస్కర్ని అదిమి పట్టుకున్నాడు.

దిలీప్ చెపుతున్న వాక్యాలను వింటూనే సత్యరాజు ఆవిధంగా చేశాడు. చంచల కుడిచేతికీ, భాస్కర్ ఎడమచేతికీ బేడీలు వేశాడు. ఈవిధంగా సత్యరాజు చేస్తూ ఉండగా దిలీప్ కొంగొక పెళ్ళి మంత్రాన్ని వల్లించాడు.

సుబ్బారావు సత్యరాజువంక చూసి "నువ్వు చాలా పొరపాటు చేస్తున్నావు. ఈ వెధవ పచ్చి ఖూనీకోరు - వీడిపేరు త్రిశూలం దొంగ. వీణ్ణి బంధించకుండా చిల్లర నేరగాళ్ళని పట్టుకుంటున్నావు. వాణ్ణే పట్టుకో" అని అరిచాడు.

త్రిశూలం దొంగ సంగతి సత్యరాజుకేం తెలియదు. అందుచేత ఈ మాటలు అతడిలో ఏవిధమైన సంచల నాన్నీ కలిగించలేదు. అయినా ఈ వ్యక్తిని విడిచి పెట్టడం భావ్యంకాదని సత్యరాజు భావించకపోలేదు. ఇతణ్ని కూడా కారులో ఎక్కించుకొని తీసుకుపోవ డం మంచిదని అతడు తలంచాడు.

అయితే సరిగ్గా ఆ సమయానికి, అడవిలోని బంగ ళాలో ఉంటున్న నరహరీ, అతని రౌడీలూ ఈ ప్రాంతానికి వచ్చారు. వాళ్ళని చూశాక సుబ్బా రావులో ఆశ రేకెత్తింది. సత్యరాజు కూడా అలాగే భావించాడు.

నరహరి లోలోపల ఎంత చెడ్డవాడయినా, లోకుల దృష్టిలో ఘరానా వ్యక్తి. ఇతని దుష్ప్రవర్తన సత్య రాజుకి తెలియదు. అందుచేత "కౌన్సిలర్ గారూ! సమయానికి సరిగ్గా వచ్చారు. సుబ్బారావుగారిని ఆస్పత్రిలో చేరవేయాలి. ఈ ముగ్గుర్ని పోలీసు స్టేష నుకి తీసుకెళ్లాలి. నాకు తోడ్పడండి" అని సత్యరాజు అన్నాడు.

"నరహరిగారు వచ్చాక యింక బాధలేదు. సత్య రాజూ! ఆ యిద్దరు దొంగల్ని తీసుకొని నువ్వెళ్లు. ఈ త్రిశూలంగాణ్ని నరహరిగారు బంధించి తీసు కొస్తారు" అన్నాడు సుబ్బారావు.

'త్రిశూలం!' అనే పేరు వినేసరికే నరహరి ఒళ్లు ఝుండింది. మెదడులో క్రోధం అగ్నిపర్వతంలాగ ఉబికింది. పళ్లు పటపట కొరుకుతూ నరహరి గలీప్ వంక చూశాడు.

"ఎస్. ఐ. గారూ! వీణ్ని నేను పోలీసు స్టేషనుకి చేరుస్తాను" అన్నాడు నరహరి.

"ఎందుకు లెండి. నేనే తీసుకెళతా" అన్నాడు సత్యరాజు.

"ఇక్కడే నా బంగళా వుంది. అక్కడ వాణ్ణి బంధించుతాను. వీడు చాలా ప్రమాదకరమైన వ్యక్తి. తక్కిన దొంగలతో వీణ్ణి తీసుకెళ్ళడం తప్పు!" అన్నాడు నరహరి.

"సరే! నరహరిగారు అంత ముచ్చట పడుతున్నారు. అలాగ కానివ్వండి" అన్నాడు దిలీప్.

సత్యరాజు మెత్త పడ్డాడు. దిలీప్‌ను నరహరి వద్ద విడిచి, సుబ్బారావుకి ప్రథమ చికిత్స చేయమని చెప్పి - సబ్ఇన్‌స్పెక్టర్ జక్కులదేవి ఆభరణాల దొంగలతో, కారులో వెళ్ళిపోయాడు.

నల్లరంగయ్య, ఎర్రరంగయ్యలు దిలీప్‌ని చెరోచేత్తో పట్టుకున్నారు. దిలీప్ అంగుకు తన మనసులోనే అనుమతించాడు. అతనికి ఇష్టం లేనప్పుడు ఈ రౌడీలే కాదు, యమదూతలైనా పట్టుకోనలేరన్న సంగతి మా పాఠకులకు విదితమే.

## 2

"నమస్కరించతగని నరహరిగారూ! మిమ్మల్ని తిరస్కరించడానికి కూడా నాకు మనసొప్పడం లేదు. నా గురించి మీరు వినే వుంటారు. అయినా నా మంచితనం గురించి అంతగా మీకు తెలియదనుకుంటాను. నేను 'సత్కార్య సమాజం' అనే పవిత్ర సంస్థకి సంస్థాపక-అధ్యక్షు-కార్యదర్శిని. ఈ సమాజం యొక్క అనుబంధ శాఖగా 'పాపనాశనం ప్రణాళిక' అనే దాన్ని ఏర్పరిచాను. దానికి విరాళాలు మీ చైర్మనాధముడి

వద్ద, ఈ సుబ్బిగాడి వద్దా, రంగనాయకులి వద్దా పుచ్చుకున్నాను. ఇక మీ వద్ద పుచ్చుకోవడం నా అభిమతం. అడవిలోగల బంగళాలో అధమం పదివేల రూపాయలైనా వుంటాయని కొందరి అంచనా. కావున నన్నక్కడికి తీసికెళ్లి పువ్వుల్లో పెట్టి అయిదువేల రూపాయలిస్తే, మీరు తరించకపోయినా మీ పెద్దలు తరిస్తారు" అన్నాడు దిలీప్.

"నోర్మూయ్ లంజకొడకా!" అన్నాడు నరహరి. దిలీప్ తన కాలెత్తి, బూటుతో దవడపళ్లు రాలేటట్టు నరహరి నోటిమీద కొట్టాడు. చేతుల్తో కొట్టడానికి వీలులేకుండా రౌడీలు ఆతణ్ణి పట్టుకొన్న విషయమే ఇలా కాలితో కొట్టడానికి కారణం కాదు. నరహరి వంటివాళ్లని చేతితో కొట్టినా అది సరియైన శిక్ష కాదు. కాలితోనే కొట్టాలి.

"మా అమ్మకి అసత్యవంతమైన విశేషణాన్ని నీలాంటి లుచ్ఛాలు, తుచ్ఛులు అంటగట్టబోయినప్పుడు మీ పాడు నోరు మూయించడం అవశ్యమవుతుంది. నువ్వు 'నోర్మూయ్' అన్నందుకు దానిని ఆజ్ఞగా పాటించి నీ నోటిని మూయలేను. మరొకసారి మా అమ్మని సదరు మాటతో పిలిచావో ఇప్పుడు నోరు మూసినట్టు నిన్ను చావచంపి చెవులు మూస్తాను. ఇంతే సంగతులు-డబ్బు ఇప్పించ ప్రార్థన" అన్నాడు దిలీప్.

చిగుళ్లు పగిలి కారుతున్న రక్తాన్ని చేతిరుమాలతో మారుమాటాడకుండా నరహరి తుడుచుకున్నాడు. రౌడీలిద్దరూ, నరహరిని తన్నినందుకు దిలీప్‌ను ఊరికే పోనిచ్చేవారు కాదు కానీ, అందులో ఒకడైన నల్ల రంగయ్య అమితాశ్చర్యంలో మునిగి తేలుతూ ఉండడమే వాళ్ళు సత్వర చర్య తీసుకొనక పోవడానికి

కారణం. దిలీప్‌ను చూడగానే నల్లరంగయ్య విస్తు బోయాడు. ఇతడే డాక్టరు అవతారంలోవచ్చి తన బావని తీసుకుపోయాడు. ఆ సోములు రంగనాయకు లింట్లో ఉన్నట్టు సుబ్బారావు తనకి చెప్పాడు. రాజా రావుని కారులో వేసుకొని అడవిలోనికి తీసుకు వస్తుండగా రంగనాయకులి హత్యగురించి సుబ్బారావు రంగయ్య ధ్యయానికి చెప్పాడు. 'డాక్టరు' తన బావని తీసుకెళ్లాడని నల్లరంగయ్య సుబ్బారావుకి చెప్పాడు.

సదరు డాక్టరుచేసే సాహసాలు చూశాక నల్ల రంగయ్య గాభరా పడ్డాడు. 'ఈడే డాకటేరు ఏషంలో మా బావని తీసుకెళ్లింది" అని సుబ్బారావుకి నల్ల రంగయ్య చెప్పాడు. ఈ విషయాన్ని సుబ్బారావు వినిపించుకోని స్థితిలో వున్నాడు. అతని చేతులు బాధిస్తున్నాయి. "తొందరగా నాకేదో మందు వేయించండి" అని సుబ్బారావు ప్రాధేయపడ్డాడు.

నరహరి తొందరగా అది వేయించకపోయినా, తరువాత జరిగిన కథని మేము తొందరగా మా పాఠకులకి తెలియచేయదల్చుకున్నాము. ఏమంటే సుబ్బారావు చేతులు విరగడానికి కారణమూ, ఆ కారణానికి కారణమైన కొండచిలువ వృత్తాంతం నరహరి, రౌడీలు అడగడం, దానికి దిలీప్ తన సహజ ధోరణిలో జవాబు చెప్పడం మొదలైన వివరాలూ, విషయాలూ, మేము మా పాఠకులకి నివేదిస్తే వినోదకరంగానే ఉంటుంది గాని...

ఈనాటి హాస్య సాహిత్యంలో సంఘటనలు ఒకి దాని వెంబడి ఒకటి దొర్లిపోవాలట. డిటెక్టివ్ లు దూకుడుగా, ఏ వాహనం పడితే ఆ వాహనంలో పడి కాలుకాలిన పిల్లిలాగ తిరుగూ, మగ్గంలో కండెలాగ

ఇటూ అటూ పోవాలట. ఏ ప్రదేశంలోనూ కథ ఆట్టే సేపు ఆగకూడదట. పాత్రలు, వాటి మనస్తత్వాలూ, వాటి భావాలూ మొదలైనవి, విపులంగా చిత్రించ కూడదట.

ఇటువంటి దురుద్దేశాలు మా పాఠకులకున్నాయని మేము భావించడంలేదు. అలా భావిస్తే అది సాహసమే కాక సత్యదూరం కూడా అవుతుందనే విషయాన్ని అవశ్యం ఆలోచించాలి. అయినా 'తరువాత ఏం జరిగింది?' అనే కుతూహలం పాఠకులలో కలిగినప్పుడు దానిని సాధ్యమైనంత త్వరగా చెప్పకపోతే అది రచయిత యొక్క సంవిధానానికి సరియైన సౌభాగ్యతాపత్రం కానేరదు. చర్విత చర్వణం మంచి పద్ధతికాదు. అందుచేత తరువాత జరిగినది తొందరగా జరుగకపోయినా, మేము తొందరగానే చెప్పదలిచాం.

సుబ్బారావుని నరహరి చేతులతో లేవనెత్తి పట్టుకొని మెల్లగా నడిపించాడు. దిలీప్‌ను రంగయ్య వ్యాఘ్రం చేతులు పట్టుకొని నడిపించారు. ఈ బృందం ఇచ్చటనుండి అడవిలోని బంగళా వద్దకు వెళ్ళారు. సుబ్బారావుని ముంజరి వసారాలో బల్లమీద పడుకోబెట్టారు. దిలీప్‌ను నడిపించుకుంటూ నరహరీ, రాడీలు హాలులోనికి వెళ్లారు.

ఈ బంగళాలోనే రెండు వేరే గదుల్లో ఒంటిమీద తెలివిలేని మాణిక్యం, ఏ మాత్రం స్పృహలేని రాజారావు ఉన్నారన్న సంగతి మా పాఠకులకి మళ్లా ఒక సారి జ్ఞాపకం చేస్తున్నాం. ఎందుచేతనంటే దిలీప్‌ను కూడా ఆ ఇద్దరూ ఏ పరిస్థితిలో వున్నారో ఆ పరితాప కర పరిస్థితిలోనికి పంపించాలని యీ ముగ్గురూ భావిస్తున్నారు.

తాను ఉంచుకొన్న యువతి యొక్క రహస్య విటుడని భ్రమించి, ఎవరో జాడ తెలుసుకోవాలని మాణిక్యాన్ని చిత్రహింస పెట్టాడో ఆ వ్యక్తి దొరికాక వాణ్ణి చితకబాదాలని కుళ్ళబొడవాలని నరహరి ఉబలాటపడడానికీ, ఉరకలు వెయ్యడానికి సమంజసమైన కారణం ఉంది. ఇదొక్క కారణం చాలనట్టు దిలీప్ నరహరి నోటిమీద కాళ్ళతో ఇంతకు ముందు కొట్టాడు. పుండు మీద కారం జల్లినట్టు అనుమానానికి తోడు అవమానం జరిగింది. అందుచేత దిలీప్‌ను ఎంత వేగం బాధ పెట్టాలని నరహరి ఉవ్విళ్ళూరాడు.

నల్లరంగయ్య సరేసరి. తన బావమరిదిని కాపాడుతానని చెప్పి తీసుకెళ్ళి రంగనాయకులింట్లో చేరవేశాడు. పోలీసుల చేతికి అప్పచెప్పాడు. ఇటువంటి 'నమ్మక ద్రోహి'ని నిలువునా చంపెయ్యాలని ప్రతీకార వాంఛ ప్రబలిన పశుప్రాయుడు భావించడంలో, అతని ఉద్దేశంలో తప్పులేదు.

"నీకూ మాణిక్యానికీ సంబంధముందా లేదా? చెప్పు" అని నరహరి దిలీప్‌ను అడిగాడు.

"ఉంది! లేకేం!" అన్నాడు దిలీప్, చిరునవ్వులు పెదవిమీద చిందులాడగా. కామ ప్రవృత్తే పచ్చకామెర్లలాగ ఆవరించిన మానవుడు ప్రతి విషయాన్నీ మాటనీ ఆ కోణంలోంచే చూస్తాడు, అర్థం చేసుకుంటాడు. నరహరి ఉద్దేశంలో 'సంబంధం' అంటే, లైంగిక, శారీరక, కామ సంబంధమే. అయితే దిలీప్ ఈ అర్థంలో జవాబు చెప్పలేదు. సత్కార్య సమాజం యొక్క కార్యక్రమాల కోసం వ్యాపారరీత్యా తప్ప ఎవరితోనూ ఏ విధంగానూ దిలీప్‌కు సంబంధాలు లేవు. అందుచేత అతడు ఉన్నదున్నట్టు వక్కాణించాడు.

దిలీప్ ప్రత్యుత్తరాన్ని విన్న నరహరి తోకతొక్కిన త్రాచులాగ లేచాడు. ఆలోచనా జ్ఞానశూన్యుడై ఆగ్రహోదగ్రుడై పోయాడు. "ఉంది ? ఉంది? ఉంటుం దని నాకు తెలుసు. మాణిక్యం మండ ఎంత హింసిం చినా చెప్పకపోవడానికి దానికి నీమీద ప్రేమే కారణ మని నాకు తెలుసు. ఇంక నిన్ను బతకనివ్వకూడదు" అని నరహరి తన వద్దనున్న పిస్తోలుని తీశాడు.

"మానవులు బతకడమో, చావడమో తోటిమాన వుల ఆగ్రహానుగ్రహాలపైనే ఆధారపడి ఉంటే భూలో కంలో జనాభా చాలా తగ్గిపోయేది. ఏనాటికైనా నేను కనికరించి నిన్ను బతకనివ్వాలిగాని, నా మరణంగాని మనుగడగాని నీ చేతిలో లేదు. ఇది నువ్వు ఎంత త్వరగా తెలుసుకుంటే అంత మంచిది" అని దిలీప్ నిశ్చింతగా నిదానంగా చెప్పాడు.

నరహరి పిస్తోలు ఎక్కుపెట్టి దిలీప్ గుండెలని గురి చూసి పేల్చబోయాడు. సరిగ్గా ట్రిగ్గర్ లాగబోయే సమయంలో సుబ్బారావు వరండాలో నుంచి హాలులో కొచ్చి "ఆగండి. నరహరిగారూ ఆగండి. వీణ్ణిగాని మీరు చంపేస్తే ఆ ముప్పు మన కొంపన్ని చుట్టుకొం టుంది. ఆగండి" అని అరిచాడు. సుబ్బారావు ఎందుకు వారించాడో నరహరికి తెలియలేదు.

"ఈ త్రిశూలంగాణ్ణి నీకు సత్యరాజు అప్ప చెప్పాడు. వీడు నిజంగా రంగనాయకుల్ని చంపక పోయినా, వీడే చంపాడని, డి. యస్. పి. అనుకుంటు న్నాడు. అందుచేత వీడిసంగతి, అంటే వీడిని మీకు అప్పగించిన విషయం, సత్యరాజు ఆయనకి తెలియచేసిన తక్షణం డి. యస్. పి. వీడికోసం వస్తాడు. వీడుగాని చచ్చిపోయుంటే ఆ హత్య నువ్వే చేశావని నిన్ను

అరస్టు చేస్తాడు. నీ మూలంగా మేము ఇరుక్కుంటాం" అన్నాడు సుబ్బారావు భయపడుతూ.

దిలీప్ చిరునవ్వు నవ్వుతూ ఏం మాట్లాడలేదు. తను బ్రతికుండడం సుబ్బారావుకి ఎంతమాత్రం ఇష్టం లేక పోయినా, ఆత్మ సంరక్షణార్థం పగవాడి ప్రాణాలను ఈ దుష్టుడు కాపాడడం నవ్వు పుట్టించక తప్పదు.

"వీణ్ణికూడ చంపేసి శవాన్ని పాతేద్దాం. లేదా పారేద్దాం. వీడు పారిపోయాడని చెబ్దాం" అన్నాడు నరహరి; దిలీప్ ఇంకొక్క క్షణం కూడా ప్రాణాలతో ఉండడం ఎంతమాత్రం సహించలేక.

"వీణ్ణి పాతిపెట్టినా, పారవేసినా, కాల్చినా, నువ్వు చంపితే, నిన్ను హత్యానేరానికి డి. యస్. పి అరెస్టు చేయకమానడు."

"నేను చంపినట్టు ఎలా తెలుస్తుంది. మీ ముగ్గురిలో ఎవరైనా చెప్పేస్తారా ?" అని నరహరి అనుమానంతో అడిగాడు.

"ఎందుకు చెప్పరు ! ఘరుగులకన్నా కనాకష్టంగా నికృష్టంగా బ్రతికే మీలో ఏ ఒక్కడైనా స్వంత లాభమే చూసుకుంటాడు. ఎవరి ప్రాణాలు వాళ్ళకి తీపి. అందుచేత, తాను బయట పడడానికి తల్లిని చంపుతున్నా చంపేసే రకాలు కాబట్టి, చెప్పేస్తారు" అన్నాడు మందహాసం చేస్తూ దిలీప్.

ఈ నగ్నసత్యాన్ని జ్ఞాపకం చేయగానే నరహరిలో ఒక్కసారి ఆవేశం కలిగింది. అతని 'హత్యా ఉత్సాహం'పైన కడివెడు చన్నీళ్లు జల్లినట్టయింది. ఎత్తిన పిస్తోలు నతడు దించేశాడు.

దించి, "మరి వీణ్ణి ఊరికే ఎలా పోనివ్వడం ?" అని స్వగతంగా పైకన్నాడు నరహరి.

"ఊరికే పోనిచ్చినా నేను పోను. మీరు అయిదు వేల రూపాయలు ఇచ్చేదాక కదల్ను" అన్నాడు దిలీప్ విశ్వాసంతో.

ఈ జవాబు ముల్లుకర్రతో పొడిచినట్లు నరహరికి తోచింది. అయినా అతడు దిలీప్ కేం సమాధానం చెప్పలేదు. "మరేం చేద్దాం సుబ్బారావు?" అని నరహరి అడిగాడు.

"నా జేబులో బేడీలున్నాయ్. వీడి చేతులకి అవి తగిలించి ఇక్కడే వీణ్ణి ఉంచుదాం. నన్ను ఆస్పత్రికి తీసుకెళ్ళండి. ఆ తరవాత చైర్మన్ గారితో సంప్రదించి వీడి సంగతి ఆలోచిద్దాం" అన్నాడు సుబ్బారావు, విరిగిపోయిన చేతులబాధ ఇనుమడించగా.

"సరే వీణ్ణిక్కడే ఉంచుదాం" అన్నాడు నరహరి.

"నేను ఉండదలుచుకొన్నాను కాబట్టి" అని దిలీప్ ఆ వాక్యాన్ని పూర్తిచేశాడు.

సుబ్బారావు జేబులోని బేడీలను నల్లరంగయ్య తీశాడు. తీసి ఇవ్వడానికి సుబ్బారావుకి చేతులు లేవాయె. నల్లరంగయ్య తన జేబులో చెయ్యి పెట్టి బేడీలను తీస్తూ ఉంటే ఇక మీదట తన జీవితం ఎంత నిస్సహాయస్థితిలో ఉంటుందో సుబ్బారావుకి అర్థమై అతడు భోరున ఏడ్చాడు. తిండి దగ్గర్నుంచి ఇతరులే ఇంక తనకు తినిపించాలి. తను చేసిన పాపాలకి ఈ విధంగా భగవంతుడు కట్టి కుడుపుతున్నాడని ఇంక కొన్ని రోజుల్లో అతను సంపూర్ణంగా తెలుసుకుంటాడు.

బేడీలను నల్లరంగయ్య తీసుకుంటూ ఉండగా, దిలీప్‌ను చంపడానికిగాను చైర్మన్ సుబ్బారావు కిచ్చిన

డబ్బు కిందపడింది. దానిని ఎర్రరంగయ్య తీసి మళ్ళా సుబ్బారావు జేబులో పెట్టేశాడు. ఈ డబ్బుని దిలీప్ చూశాడు.

"ఓహో! సుబ్బిగా! మళ్లా డబ్బు ఆర్జించావా? అయితే మంచిదే. ఇన్నాళ్ళూ రెండు చేతులా లంచం పుచ్చుకున్నావు. ఇక మీదట పుచ్చుకోవాలన్నా రెండు చేతులూ లేవు. ఇప్పుడు దానికి కూడా ఎవరూ సిద్ధపడరు. ఈ డబ్బు ఆపరేషన్ ఖర్చులకి అట్టే పెట్టుకో" అన్నాడు దిలీప్.

బేడీలను చేత్తో పట్టుకొని నల్లరంగయ్య, లోగడ పోలీసు స్టేషన్‌లో తనను ఏ విధంగా బంధించేవాడో ఆ విధంగా దిలీప్‌ను బంధించాలని తలపోశాడు. తన జన్మలో ఎవరికీ తాను బేడీలను వేస్తానని వాడు కలగన లేదు. దిలీప్‌ను ఒక కిటికీ వద్దకు తీసుకెళ్ళి, అతని ఒక చేతికీ, కిటికీ ఊచకీ బేడీలను వాడు వేశాడు. దిలీప్ "ధన్యవాదాలురా! దగుల్బాజీ!" అని నల్లరంగయ్యతో చెప్పాడు.

దిలీప్ 'దగుల్బాజీ' అనే పదాన్ని వాడడానికి అర్థం లేకపోయినా, ధన్యవాదాలు చెప్పడంలో సబబు లేక పోలేదు. నల్లరంగయ్య తన ఒక్క చేతికే బేడీలు వేయడం కృతజ్ఞత తెలియచేయవలసిన కృత్యమే. ఒక చెయ్యి ఖాళీగా ఉంటే దిలీప్ అద్భుతాలు చేయగలడని మా పాఠకులకి తెలిసినదే. ఈ సంగతి దిలీప్‌కు తెలుసు. తెలియనిదల్లా ఒక్క నల్లరంగయ్యకే!

దిలీప్‌ను బంధించాక, ఆ ముగ్గురూ, సుబ్బారావుని తీసుకొని బంగళా బయటకు నడిచారు. వాళ్లు వెళ్ళిపోతూ ఉంటే దిలీప్ నవ్వుతూ "వెళ్ళగానే ఉత్తరాలు రాయండి" అన్నాడు.

నరహరి కోపంగా దిలీప్ వంక చూశాడు. "వెర్రి ప్రియుడా! మిర్రిమిర్రి చూడకు! నీ వియోగం నేను సహించలేను. అందుచేత ఇక్కడున్నట్టుగా వచ్చి పోవాలి. టాటా బై బై చీరియో!" అని దిలీప్ నరహరిని చూస్తూ ఖాళీగా ఉన్న చెయ్యి ఊపాడు.

నరహరి నోరు మూసుకొని వెళ్ళిపోయాడు.

అశోకవనాన్ని పీకి పోగులు పెట్టిన ఆంజనేయుడు కావాలనే రక్కసి మూకలకు పట్టుబడ్డాడు. వాళ్ళు కట్టిన తాళ్ళకి కట్టుబడ్డాడు. అయితే లంకేశ్వరుడి దర్బారులో అవసరమొచ్చినప్పుడు ఆ కట్లనుండి విడిపించుకున్నాడు. తను చెప్పదలచినది నాలుగూ రావణాసురుడికి చెప్పాడు. అస్ఖలిత బ్రహ్మచారి, అసమాన బలసమన్వితుడు ఆంజనేయుడు. మన దిలీప్ కూడా అటువంటివాడే. రావణ సభలో హనుమంతుడు కట్లు విప్పుకొన్నట్టు ప్రస్తుతం ఇక్కడ ఎవరూ సభ తీర్చక పోయినా, రాక్షసులు ఆసుపత్రికి వెళ్ళిపోయినా, దిలీప్ తన చేతులను తొలగించుకున్నాడు.

తాళంచెవి లేకపోతే సాధారణంగా పోలీసు బేడీల నుండి విడుదల పొందడం చాలా కష్టం. అయితే కష్టమైన పనులన్నీ సులభంగా చేయగలిగిన వారికిది పెద్ద లెక్కలోనికి రాదు. బేడీలను తొలగించుకున్నాక దిలీప్ ఆ బంగళాలోని వివిధ గదులను పరిశోధించ ఉపక్రమించాడు.

నరహరి వచ్చి సత్కార్య సమాజానికి బలవంతపు విరామం ఇచ్చేదాకా దిలీప్ ఇక్కడనుంచి ఎలాగూ కదలడని చెప్పాడు కనుక ఇతన్ని ఇక్కడే వదలిపెట్టి వెళ్ళి తదితర పాత్రలను కలుసుకుందాం. (వాళ్ళని మనం విడిచిపెట్టి చాలా సేపయింది).

ఈ గాథను మేము అతి తొందరగా మా పాఠకులకు తెలియజేయదలిచాము కాబట్టి మిగతా పాత్రలు ఎక్కడెక్కడ ప్రస్తుతం ఉన్నది సింహావలోకనం చేసి, ఏ పాత్రలను మొదట కలుసుకుంటే కథ ముందుకు సాగుతుందో వారినే కలుసుకుందాం.

ఇక్కడ ఈ అడవిలోని బంగళాలో ముగ్గురు ముఖ్య పాత్రలున్నారు. వీరి సంగతి కథకి ఇప్పుడిప్పుడే అప్రస్తుతం.

మిగతా పాత్రల ఆచూకీ ఏమిటనగా :

రంగనాయకులింట్లో :

1. చైర్మన్ చంద్రశేఖరం.
2. కౌన్సిలర్ పురుషోత్తం.
3. డి. యస్. పి. సత్యనారాయణ.
4. అతని సిబ్బంది.
5. యింకా నిద్రపోతున్న సోములు.
6. నౌఖరు రాముడు.

హాస్పటల్ లో :

1. చేతులు విరిగిన సుబ్బారావు.
2. అతణ్ణి చేర్పించుతున్న నరహరి.
3. ఇతణ్ని అనుసరించిన నల్లరంగయ్య.
4. వీణ్ని అంటిపెట్టుకున్న ఎర్రరంగయ్య ఉన్నారు.

పోలీసు స్టేషన్లో :

1. పట్టుబడిన చంచల.
2. ఆమెకు కట్టుబడి పట్టుబడిన భాస్కర్.
3 వీళ్ళని బంధించిన సత్యరాజు.

చంచల యింట్లో :

1. వనభోజనాల తోటలో చెయ్యి విరిగిన మురళీధర్.

2. జక్కులదీవి ఆభరణాలు.

తన యింట్లో :

1. హంతకుడు.

2. అతని యింటికి కాపలా కాస్తున్న వేటకుక్క.

ఈ గాథలో యిప్పటి దాకా వచ్చిన పాత్ర లన్నిటినీ ఎవరెక్కడున్నదీ తెలియచేశాం కనుక, ఇది ప్రజాస్వామ్యయుగం కనుక, మెజారిటీని మన్నించాలి కనుక, సంఖ్యా బలంలో హెచ్చు పాత్రలు రంగనాయకులింట్లోనే ఉన్నవి కనుక, మొదట మనం అక్కడకే వెళదాం.

# 3

ఆ పాటికి డి. యస్. పి. సత్యనారాయణ, చేయవలసిన దర్యాప్తు సంతటిని ముగించి ఉండేవాడే గాని ముఖ్య సాక్షి అయిన సోము లింకా నిద్రపోతూనే ఉన్నాడు. వాడికి తెలివివచ్చి, వాడి వాంగ్మూలం తీసుకుంటేనే గాని ప్రాథమిక విచారణ పూర్తికాదు. నౌఖరు రాముడి పెట్లో నాలుగువేల రూపాయల సగదు కనబడడంచేత వాణ్ని అనుమానించి ప్రశ్నించడం మొదలు పెట్టవచ్చు. అయితే, ఏమాత్రం తెలివితేటలున్న వాడైనా నేలవిడిచి సాము చేయడు. అతి సుతారమైన ఉక్కు తీగమీద నడిచేవాడు కూడా ఆ తీగనే, నేలగా తన కాళ్ళకి తరిఫీదు యిచ్చాకనే దానిపైన, నిర్భయంగా నిర్లక్ష్యంగా నడుస్తున్నట్టు పైకి కనబడుతూ నడుస్తాడు. అయితే, ప్రతిక్షణం పట్టు తప్పకూడదనీ, పడిపోకూడదనీ అతడు తాపత్రయ పడుతుంటాడు.

నేరవిచారణ, ప్రాథమిక పరిశోధన, ప్రాటిమీద నడకలాంటివే...అనుమానితుల్లో అధిక సంఖ్యాకులు అబద్ధాలాడుతారు. ఎవరు అబద్ధాలాడుతున్నది తెలుసుకోడానికి చూచాయగా కొద్దిపాటి సత్యమైనా తెలుసుకొనడమో, ఊహించడమో అతి ముఖ్యం. హత్య జరుగుతున్నప్పుడు, మూగ్గొంతుల నుప్పాతిక మూడు నిమిషాలు ముగ్గురు వ్యక్తులే ఈ ఇంట వున్నారు. అందులో ఒకడు హంతకుడు. తక్కిన ఇద్దరూ రాముడు, సోములు. అందులో ఒకణ్ణే సత్యనారాయణ సగం ప్రశ్నించాడు.

చైర్మన్ చంద్రశేఖరం, కౌన్సిలర్ పురుషోత్తం ఇంకా ఆ ఇంట్లోనే వున్నారని మా పాఠకులకి తెలుసు. వాళ్లు ఆ యింట్లో కిట్లో వాట్లో ఆ నోటా ఈ నోటా అనుకునే మాటలు వింటూ గోతికాడ నక్కల్లాగ కూర్చున్నారు. ప్రస్తుతానికి ఈ రంగస్థలంలో యింతే సంగతులు. చిత్రగించవలెను, మరికొన్ని సంగతులు.

(మెజారిటీ సూత్రాన్ని మన్నించి పాటించి మనం ఈ చోటుకొచ్చాం, గాని యిక్కడ కథ నడవలేదు, ఇంకొంతసేపటికి నడుస్తుంది గాని అలా నడవడానికి నాంది అయిన కొన్ని సంఘటనలు ఇతరత్ర జరిగాయి. వాటిని తెలుసుకోవడం అత్యవసరం.

చింపిలా భాస్కరులు పోలీసుస్టేషన్ లో ఉన్నారన్న సంగతి ముందే చెప్పాము. వాళ్లు ఎలాగైనా తమ మీద నున్న అభియోగాన్ని తప్పించుకొనడానికి ప్రయత్నిస్తున్నారని మేము వేరే చెప్పనక్కర్లేదు. తప్పిదం చేసినవారే కాదు, ఎవరైనా సరే తప్పించుకొనడానికి ప్రయత్నిస్తారు.

అయితే వీళ్లు తాము బయటపడడానికి సత్యరాజుకి చెప్పిన అసత్యాలు అద్భుతంగా ఉన్నవి. అబద్ధాలు ఆడే

వాళ్లకి ఎవరైనా పెద్ద పెద్ద బిరుదులు, భారీ ఎత్తు బహు మానాలు యిస్తే అందులోని అగ్రతాంబూలం ఈ చంచలకే యివ్వాలని మేము ఘంటాపథంగా చెప్తున్నాము.

"ఇన్‌స్పెక్టర్ గారూ!" అని ఆమె సత్యరాజుని సంబోధించింది.

"నేను సబ్‌ఇన్‌స్పెక్టర్నే" అన్నాడతను.

"ఈ కేసు పరిష్కరించాక మీరు ఇన్‌స్పెక్టరవుతారని యిప్పటినుంచే అలా పిలుస్తున్నాను" అని ఆమె సుతారంగా, ఓరచూపుతో ఒయ్యారంగా చూస్తూ అంది.

"ధన్యవాదాలు" అని సత్యరాజు ఊకొడుతున్నాడు.

"మేము నేరస్థులమే!" అంది చంచల.

ఈ మాటలకి సత్యరాజెంత ఆశ్చర్యం చెందాడో భాస్కర్ అంతకు రెట్టింపు ఆశ్చర్యం చెందాడు. సాధారణంగా పట్టుకోన్న వెనువెంటనే ఏ నేరగాడు నేరం చేసినట్లు ఒప్పుకోడని సత్యరాజుకి తెలుసు. ఎలాగైనా తప్పించుకునే స్వభావంగల చంచల, ఇంత తొందరగా ఒప్పుకోడం భాస్కర్‌కి ఆశ్చర్యమే కాక కోపాన్ని కూడా కలిగించింది.

"మేము నేరస్థులమేగాని, ద్వితీయ శ్రేణికి చెందిన వాళ్లం. మా నాయకుడెలాగ చెప్తే అలా చేసేవాళ్లం. అతను మరెవరో కాదు. కౌన్సిలర్ నరహరి గారికి ఎవరినైతే మీరు అప్పచెప్పారో ఆ త్రిశూలం దేవర మా కొర. ఆయన చెప్పినట్టే మేము చేశాము. జక్కులదీవి నగలు ఆయన వద్దనే వున్నాయి" అని చంచల చెప్పింది.

ఈ మాటలు విన్నాక, భాస్కర్ చంచలను మనస్సులో అభినందించుకొని, తల ఊపి "అవునండి. ఆ నగలు ఆయన వద్ద వున్నవి. వెళ్ళి వెతకండి" అన్నాడు.

తాను ఆడిన అబద్ధాన్ని భాస్కర్ అందుకొని, అర్థం చేసుకొని, దానికి తాళం వేస్తున్నందుకు చంచల సంతోషించింది. ఇది పోలీస్ స్టేషన్ అయిపోయింది గాని లేకపోతే అతణ్ణి, ఎగిరి గంతేసి, ఆమె ముద్దు పెట్టుకొని ఉండేను.

సత్యరాజు ఈ విషయాన్ని నమ్మలేకపోయాడు. అయినా నేరస్తుల ప్రపంచంలో సూర్యుడు పడమట ఉదయిస్తాడన్నా విశ్వసించవలసిందే. ఘరానా వ్యక్తుల్లాగ కనిపించేవాళ్లు కప్పుకున్న మేకతోలు ఊడదీసే దాకా వాళ్లు దుష్ట మృగాల్లోకల్లా దుష్టమైన పులి జాతికి చెందిన వాళ్ళని తెలియదు. ఆ మేకతోలుని తోటి నేరగాళ్లే తొలగించుతూ ఉండడం పరిపాటి. పోలీసులు పెట్టే బాధలకి, కొట్టే లాఠీ దెబ్బలకి తట్టుకోలేక నేరగాళ్ళు తమ ఆత్మీయులను సైతం అప్ప చెప్పేస్తారు.

అందుచేత 'త్రిశూలం గ్యాంగ్' ఈ ముఠా నాయకుడని చంచల చెప్పగా విశ్వసించడానికి ఎన్ని అభ్యంతరాలను సత్యరాజు తన మనస్సులో జనింప చేసుకున్నాడో అన్ని అవకాశాలనుకూడా ఆహ్వానించుకోనక తప్పలేదు. అతడు చంచల వంక చూస్తూ "ఈ సంగతి ముందే చెప్పలేదేం? అక్కడ అతని ముందే చెప్పలేక పోయావా!" అని అడిగాడు.

"అవేం మాటలు ఇన్ స్పెక్టర్!" అంది చంచల.

"అవును అవేం మాటలండి" అని భాస్కర్ వంత పాడాడు.

"మా నాయకుడి గుట్టు మేము బట్టబయలు చేస్తే అతడు మమ్మల్ని చంపెయ్యడా ?" అంది చంచల.

"అవును చంపేస్తాడు" అన్నాడు భాస్కర్.

"ఇప్పటికే, రంగనాయకుల్ని చంపాడు. ఒకర్ని చంపితే ఎంత శిక్షో, నలుగుర్ని చంపినా అంతే శిక్ష కదా ! మమ్మల్ని నీ కళ్ళముందే చంపేసేవాడు" అంది చంచల.

"అయితే ఇన్‌స్పెక్టర్ సుబ్బారావుగారు చెప్పింది నిజమేనన్నమాట. ఆ త్రిశూలం వ్యక్తి నిజంగా హంతకుడే నన్నమాట."

"అక్షరాలా అతనే హంతకుడు. మా కళ్ళతో ఆ హత్య చూశాం." అన్నాడు భాస్కర్.

"భాస్కర్ !" అని చంచల ఆశ్చర్యపోతూ మందలించింది. ఆడవాళ్లు అబద్ధమాడితే గోడపెట్టినట్టుంటుంది. అతికేటట్టు అబద్ధమాడడం అందరికీ చేతకాదు. తన అధర్మ సహచారిణి ఆడుతున్న అబద్ధాలకు 'తందాన తానా' అని వంతపాడే భాస్కర్ హద్దు మీరాడు. తాత్కాలికంగా తప్పించుకోవడానికి తమకేదో ముప్పు ఉన్నట్లు, దానికి తమ విరోధే నాయకుడైనట్టూ చంచల అబద్ధమాడింది. అంతవరకూ ఆమె ఆడిన అబద్ధాలకు ఆత్మరక్షణ అనే అలిఖిత పూర్వకమైన పెర్మిషన్ ఉంది. పర్యవసానంనుంచి సులభంగా బయట పడవచ్చు.

కాని ఈ తెలివితక్కువ పద్దమ్మ భాస్కర్ ఆడిన అబద్ధంవల్ల తామిద్దరూ ఇప్పుడొక హత్యకేసులో యిరుక్కున్నారు. దీనిలోంచి బయటపడడం పద్మవ్యూహంనుంచి బయట పడడమే. తానెంత సూక్ష్మ

బుద్ధిగలదైనా సాకులు, మిషలు ఆలోచించగల బుద్ధి మంతురాలైనా, ఈ ఊబిలోంచి వెంటనే బయట పడలేనని గ్రహించింది.

"ఏమిటి, హత్యకు మీరు సాక్షులా!" అన్నాడు సత్యరాజు. నిద్రనుంచి లేచిన ఏనుగులాగ అతకి మెసలుతున్నది.

"అవును" అని సంపాల అంగీకరించక తప్పలేదు.

అయితే ఈ ఇద్దర్నీ ప్రశ్నించి విచారించవలసినది డి. యస్. పి సత్యనారాయణే. వీళ్ళని లాకప్పులో పెట్టి ఆయన దగ్గరకువెళ్ళి ఈ సమాచారాన్ని తెలియ చేయాలి. ఈ సంగతులు ఫోనులో చెప్పడంకన్నా, ముఖాముఖిని ఆయనికి చెప్పడమే మంచిది.

సత్యరాజు వెంటనే వీళ్ళని లాకప్పులో పెట్టించాడు. తను యాకాయకని రంగనాయకులింటికి వెళ్ళాడు. వెళుగున్నంతసేపూ అతని మనసు ఆరాటపడుతూనే ఉంది. ఆ త్రిశూలం దొంగని అరెస్టుచేసి తీసుకెళ్ళమని సుబ్బారావు చెపితే నేను వినిపించుకోలేదు. సగాస గ్నంటు ఈ సంగతి తెలుసుకొని ఏం చివాట్లు పెడతారో. నేను త్రిశూలం దొంగని నరహరిగారికి అప్ప చెప్పానుగాని, వాడు పారిపోతే!

రంగనాయకులింట్లో, చైర్మన్, పురుషోత్తం మొదలైన వాళ్ళతో మాట్లాడుతున్న డి. యస్. పి సత్య నారాయణను సత్యరాజు కలుసుకుని "సార్, మాట. కొంచెం ఇలా పక్కకొస్తారా? త్రిశూలం దొంగ గురించి మీకు చెప్పాలి" అన్నాడు.

"క్షమించండి. ఇప్పుడే వస్తాను" అని సత్యనారాయణ, ఊరి పెద్దలవద్ద నుంచి నిష్క్రమించాడు.

సింహస్వప్నం లాంటి త్రిశూలం అనే మాట వినగానే ఛైర్మన్ గుండెల్లో జెట్ విమానాలు హోరెత్తాయి. 'ఈ సబ్ ఇన్‌స్పెక్టర్, సత్యనారాయణకేం చెప్తాడో?' అని అతని హృదయంలో అనుమానం అనే అగ్నిపర్వతం పగిలింది.

పుచ్చకాయల దొంగ అంటే భుజాలు తడుముకొనే వాళ్ళకి, అనగా నేరగాళ్ళకి, లోకుల ప్రతి చూపూ, ప్రతి చేష్టా, ప్రతి పలుకూ ములుకుల్లాగ తగులుకొనడంలో ఆశ్చర్యంలేదు. ఈ సత్యరాజు చేతనే త్రిశూలం దొంగని కాల్పిస్తానని సుబ్బారావు పెద్ద కబుర్లు చెప్పి తన వద్ద డబ్బు లాక్కున్నాడు. తను ఆ కుట్రకి తన ఆమోద ముద్ర వేశాడు. సుబ్బారావు ఈ సత్యరాజుని కలుసుకుని త్రిశూలం వ్యక్తిని కాల్చమని చెప్పాడు కాబోలు. ఇతను కాల్చనని నిరాకరించడమే కాక తమ కుట్రంతా డి. యస్. పికి చెప్పి బట్టబయలు చేయబోతున్నాడు కాబోలు.

'ఇప్పుడేం దారి! ఎలా తప్పించుకోవడం?' అని ఛైర్మన్ ఒకవంక ఆరాటపడుతూనే, 'ఇంతకీ ఈ సత్యరాజు ఏం చెప్తున్నాడో వింటే పోలా?'' అని సంచలనం చెందిన మనస్సుని సంబాళించుకొని సత్యరాజూ, సత్యనారాయణ రహస్యంగా మాట్లాడుకొంటున్న సంగతులను పొంచి వినడానికి లేచాడు. ఏమీ ఎరగనట్టు నటించుచుతూ గోడ వారగా నిలబడ్డాడు.

ఛైర్మన్ ఈవిధంగా సంచరిస్తున్నప్పుడు, కౌన్సిలర్ పురుషోత్తం ఏవిధంగా భావిస్తున్నదీ, ఏం చేస్తున్నదీ చెప్పకపోవడం చాలా తప్పు. మేము అతడి పాత్ర చిత్రణ ఇంతవరకూ తగినంత మోతాదులో కొనిచ్చాం కాబట్టి, ఆ రకమైన మనస్తత్వం కలవాడు ఎలాగ ఈ

పరిస్థితిలో ప్రవర్తించేదీ మా పాఠకులు ఊహించుకో గలరు కాబట్టి, వారిని ఆవిధంగా ఊహించుకోమని ప్రార్థించి తరువాత కథని అందుకుంటున్నాం. అయినా అంతా పాఠకుల ఊహాకే వదలిపెట్టడం భావ్యం కాదు కనుక, గాఢిరాపడిన పురుషోత్తం స్వతంగా సాహసం చేయలేని ఈ చవట,-ఛైర్మన్ చేష్టలకు కళ్లప్పగించి, కుర్చీకి అతుక్కుపోయాడని మాత్రం మనవి చేస్తున్నాం.

సత్యనారాయణా సత్యరాజూ, చాలా తగ్గు స్థాయి లోనే మాట్లాడుకుంటున్నా, వాళ్ల సంభాషణ ఛైర్మన్ విన్నాడు. దాని సారాంశాన్ని కథాగమనాన్ని ఆప కుండా నేను నివేదించవచ్చుగాని యథాతథంగా పొందుపర్చడం మంచిది.

"ఏమిటోయ్! త్రిశూలం దొంగగురించి నీకేం తెలుసు?" అన్నాడు సత్యనారాయణ.

"క్షమించండి. వాడు దొరికినా నేను పట్టుకోలేను. వాడే రంగనాయకుల్ని హత్య చేశాడట" అని సత్య రాజు బగాలు చెప్పాడు.

"ఈ సంగతి నీకెవరు చెప్పారు?"

"ఇన్స్పెక్టర్ సుబ్బారావుగారు" అన్నాడు సత్య రాజు. సరిగ్గా సత్యరాజు ఈ మాట చెప్తూండగా ఛైర్మన్ గొంతు చాలుక వచ్చాడు. అతని అనుమానాలు నిజమయ్యాయి. అయితు ప్రాణాలలో సగం పైకి పోవడానికి ప్రయత్నించాయి. ఛైర్మన్ వాటిని అదిమి పట్టుకున్నాడు.

"ఏమిటి! సుబ్బారావు చెప్పాడా!"

"అవునండి."

"ఎక్కడ కనబడ్డాడు?"

"ఊరవతల అడవిలో."

"సుబ్బారావు చెపితే నువ్వేం చేశావు?"

"ఆయన చెప్పినట్టూ నేను చేయలేదు" అన్నాడు సత్యరాజు.

'అనుకున్నంతా అయింది' అనుకున్నాడు షైర్మన్. అలా అనుకోడమే తడవుగా అతడు అక్కణ్ణుంచి కదిలాడు. కుర్చీలో కూర్చున్న కౌన్సిలర్ పురుషోత్తం వంక గాఢంగా, 'పని కొంప మునిగింది' అనే అర్థం వచ్చేటట్టు చూసి గబగబా నిష్క్రమించాడు. పురుషోత్తం అతణ్ణి అనుసరించాడు.

కంగారులో ఉన్నవాళ్లు చీకట్లో తాడు చూసి పాము అనుకుంటారు. ఈ రజ్జు సర్పభ్రాంతి తోనే, సత్యనారాయణ సత్యరాజుల మాటలన్ని విన్న షైర్మన్ పొందాడు. కడవరకూ నిలబడి, వాళ్ళ మాటలను వింటే అతను పారిపోయేవాడు కాదు. అయితే 'గాలి వానా వస్తే కథే లేదు' అని సామెత చెప్పినట్టు ఈయన కంగారు పడకపోతే ఈ గాథ మరొక విధంగా పరిణమించేది.

ఈ పారిపోతున్న పాత్రలను ప్రస్తుతానికి పారిపోనిచ్చి, మనం మళ్ళీ సత్యనారాయణ సత్యరాజుల సంభాషణ ఆలకిద్దాం.

"మీరు నన్ను జక్కులపేటి ఆభరణాల దొంగల్ని పట్టుకోమనే పంపించారు. వాళ్ళని పట్టుకోవడమే ముఖ్యమని భావించాను. త్రిశూలం వ్యక్తిని కౌన్సిలర్ నరహరిగారి బంగళాలో బంధించమని చెప్పాను. అతనే రంగనాయకుల్ని హత్యచేసిన వాడైతే పారిపోతాడేమో" అన్నాడు సత్యరాజు.

"సుబ్బారావు మాటలకి ఎంత విలువ ఇవ్వాలో అంతే ఇవ్వావులే. మరేం భయపడకు. ఆ త్రిశూలం దొంగ సుబ్బారావుని పరాభవించాడు. ఆ కోపం మనస్సులో పెట్టుకొని సుబ్బారావు గోరంతలు కొండంతలు చేస్తున్నట్టుంది" అన్నాడు సత్యనారాయణ.

చివరవరకూ పరిశోధించి తేలేదాకా ఎవర్నీ హంతకుడని నిర్ధారణ చేయకూడదు. అది బుద్ధిమంతుల లక్షణం కదా. త్రిశూలం వ్యక్తిని అనుమానితుడనే పిలవాలి గాని హంతకుడు అనరాదు. ఇది సత్యనారాయణ ఉద్దేశం.

"సుబ్బారావుగారొక్కరే కాదండి. జక్కులదేవి ఆభరణాల దొంగలు కూడా చెప్పారు. ఆ త్రిశూలం దొంగ వాళ్ళ ముఠా నాయకుడట. వాడు ఈ హత్య చేయడం ఆ యిద్దరూ చూశారట. వాళ్ళని లాకప్పులో ఉంచాను. నన్ను వెళ్ళి, నరహరిగారి బంగాళాలో నున్న త్రిశూలం దొంగని అరెస్టుచేసి తీసుకురమ్మన్నారా?" అని సత్యరాజు అడిగాడు.

"ఏమిటీ! వాళ్ళీ హత్య చూశారా?" అని సత్యనారాయణ అడిగాడు.

"అవును చూశారట."

"సరే. వాళ్ళని నేను ప్రశ్నించి ఆ సమాచారం కనుక్కుంటాను. నువ్వు..."

"త్రిశూలం దొంగని తీసుకురానా?"

"దానికి వేరే బందోబస్తు చేస్తాను. నువ్వు వెంటనే వెళ్ళి ఆ జక్కులదేవి ఆభరణాలు వెతికి పట్టుకో" అన్నాడు సత్యనారాయణ. ఆ ప్రయత్నంలో సత్యరాజు నిమగ్నుడయ్యాడు.

అయితే ఆ ఆభరణాలు చంచల యింట్లో ప్రస్తుతం లేవని మా పాఠకులకి తెలియచేస్తున్నాం. ఇంతకుముందు ఏ యే పాత్రలు ఎక్కడెక్కడున్నదీ విశదంగా మనవి చేశాం. అలా చేస్తున్నప్పుడు చంచల యింట్లో చేయి విరిగిన మురళీధర్ ఉన్నట్లు చెప్పాం.

అతను తన సహచారిణి అయిన చంచలను మామూలుగా కలుసుకోడానికి ఆస్పత్రికి వెళ్ళలేదు. నెగటివులు పోగొట్టినందుకు ఆమె అగ్గిమీద గుగ్గిలమై అతడిపైన మండిపడుతున్న సంగతి మా పాఠకులకే కాక అతనికీ తెలుసు. ఆమె తనను క్షమించదని అతడు ఏనాడో నిర్ణయించుకున్నాడు. ఇప్పుడు వికలాంగుడైన తనని ఆమె పోషించదనీ తెలుసు. [illegible] వాడివద్ద నుంచి, తమ జీవనాధారమైన నెగటివులను తెచ్చుకోనడానికే చంచల ఆమె చేరినున్న సంచీలోంచి డబ్బుతీసి యివ్వ నిరాకరించింది కదా. తనను కనికరించి పోషించుతుందా ? అందుచేత ఆమె చూడకుండా, దొరికినంత డబ్బు సంగ్రహించి పారిపోవడమే తన ఆరోగ్యానికీ, జీవితానికీ మంచిదని అతను భావించాడు.

అతని అదృష్టవశాత్తూ చంచల ఇంట్లో లేదు. అతని వద్ద ఒక తాళంచెవి వుంది కనుక తలుపు తెరచి అతడు లోపలికి వెళ్ళాడు...డబ్బు సంగ్రహించే ప్రయత్నంలో అతడికి జక్కులపేవి ఆభరణాలు కూడా కనబడ్డాయి. వీటిని మాత్రం ఎందుకు పోనివ్వాలని అతడు వాటిని కైంకర్యం చేసి తొందరగా బయటపడి, ఒంటిచేత్తోనే యింటికి తాళంవేసి వెళ్ళిపోయాడు.

ఈ ఆభరణాలు చివరకు హంతకుడి వద్దకు చేరాయన్న సంగతి యిప్పుడే మా పాఠకులకి, కొండొక

కారణంవల్ల తెలియచేస్తున్నాను. ఎందుకు చేరినదీ, ఎలా చేరినదీ సక్రమంగా వివరిస్తాను.

# 4

రంగనాయకులింట్లోంచి వాస్తవంగా బ్రతికి బయట పడ్డ చైర్మన్ చంద్రశేఖరం, కౌన్సిలర్ పురుషోత్తం వచ్చి తమ కారులో కూర్చున్నారు. వాళ్లకి ముచ్చెమటలు పోశాయి. చేతిగుడ్డతో చైర్మన్ చెమట తుడుచుకుంటూ ఆలోచించాడు.

'పారిపోవడం నేరాన్ని ఇనుమడింప చేస్తుంది' అనే ప్రాథమిక సత్యం చైర్మన్ చంద్రశేఖరానికి తెలియదని చెప్పలేను. అందుకే అతను ఆలోచనలో పడ్డాడు. ఇంతసేపటివరకూ తాను డి. యస్. పి సత్యనారాయణతో ఘరానా వ్యక్తిలాగ మాట్లాడుతూనే ఉన్నాడు. సబ్ ఇన్స్పెక్టరుతో మాట్లాడి తిరిగి వచ్చాక డి. యస్. పి తాను అక్కడ లేకపోతే తప్పని సరిగా తాము కుట్ర పన్నినట్టు భావించి తీరుతాడు. అనుమానాన్ని దృఢం చేసుకుంటాడు.

పారిపోకుండా అక్కడే కూర్చుని అతను ఏం చెప్పినా బుకాయించితే కొంత ప్రయోజనం వుంటుంది. అయితే డి. యస్. పి అరస్టు చేస్తే?

సరిగ్గా అదే సమయానికి ఆస్పత్రిలో సుబ్బారావుని చేర్పించి, నరహరి అక్కడకు వచ్చాడు. వస్తూనే "చంద్రం! నీతో చాలా ముఖ్యమైన విషయాలు చెప్పాలి" అన్నాడు.

"నీతో నేనూ ముఖ్యమైన విషయాలు చెప్పాలి" అన్నాడు చైర్మన్.

"త్రిశూలంగాడు దొరికాడు" అన్నాడు నరహరి.

"మనం పట్టుపడతాం" అన్నాడు పురుషోత్తం.

"ఛీ! శుభం పలకరా పెళ్ళికొడుకా అంటే అని సామెత చెప్పినట్టు ఇలా మాట్లాడుతావే!" అన్నాడు నరహరి పురుషోత్తాన్ని మందలిస్తూ.

"నిజం చెప్పాను. ఆ త్రిశూలంగాణ్ణి కాల్చి చంపమని సుబ్బారావు సత్యరాజుకి చెప్పాడుగా. ఈ సంగతి కాస్తా సత్యరాజు డి. యస్.పికి చెప్పేశాడు" అన్నాడు పురుషోత్తం.

"ఏడిసినట్టే ఉంది. నేను త్రిశూలంగాణ్ని కాలుస్తానంటే సుబ్బారావే వద్దని వారించాడు" అన్నాడు నరహరి.

"ఏమిటీ?" అని చైర్మన్, పురుషోత్తం ఆశ్చర్యం చెందారు.

జరిగినదంతా నరహరి వాళ్ళిద్దరికీ చెప్పాడు. 'త్రిశూలంగాణ్ని' బంగళాలో బంధించినట్టు తెలియచేశాడు.

"అయితే సుబ్బారావు ఆ వెధవని కాల్చమని సత్యరాజుకి చెప్పలేదన్నమాట!" అని చైర్మన్ సంతృప్తి చెందాడు.

"మనం ఇప్పుడేం చేద్దాం." అన్నాడు పురుషోత్తం.

"ఆ వెధవని బతకనివ్వకూడదోయ్" అన్నాడు చైర్మన్.

"మరి వాణ్ని చంపితే ముప్పొస్తుందన్నాడే సుబ్బారావు" అని పురుషోత్తం తనకి సహజమైన పిరికిమాట పలికాడు.

"ముందు మనం బంగళాకెళ్లి వాడిపని ఎలా పట్టాలో తోవలో ఆలోచిద్దాం" అని చైర్మన్, కారు స్టార్టు చేశాడు. గుప్తచరవిషయంలోని ముగ్గురూ బంగళా కెళ్ళేదారి పట్టారు. వాళ్ళకన్నా ముందే మనం అక్కడి కెళ్లి పరిస్థితులు ఎలా ఉన్నాయో పరిశీలిద్దాం.

***

బేడీలనుంచి విమోచనాన్ని కలిగించుకున్న దిలీప్ అడవిలోనున్న బంగళాలోని గదుల్ని పరిశోధిస్తున్న దిలీప్ రాజారావుని మొదట చూశాడు. 'ఇతను ఇక్కడెందుకున్నాడా!' అని ఆలోచించి దానికి సమాధానం పొందడానికి దిలీప్ ఏమీ ప్రయత్నించలేదు. ఊహించే ఊహలు నైజం అవుతాయన్న నమ్మకమున్నప్పుడే, ఊహించవలసిన అవసరం కలిగినప్పుడే దిలీప్ లాంటి వ్యక్తులు మెదడుకి పని కల్పిస్తారు.

సాధారణ వ్యక్తులు జైలునుంచి తిరిగి వస్తున్నవాణ్ణి చూసి 'ఎప్పుడు రావడం, ఇప్పుడేనా!' అని వ్యర్థ ప్రశ్న వేస్తారు. అలాంటి మనస్తత్వం కలవాళ్లే అనవసరంగా ఆలోచిస్తారు. రాజారావుకి అప్పుడే తెలిసి వచ్చింది. అతను ఎలాగూ తను అక్కడికి రావడానికి గల కారణం, ఒక గదిలో బంధించబడడానికి హేతువేమిటో ఎలాగూ చెప్తాడు. ఇప్పుడు పోయినా, సరిహాకీ, అతని రౌడీలు తిరిగి వచ్చేదాకా బోలెడంత వ్యవధికూడా ఉంది.

కన్ను తెరచి తెరవగానే రాజారావు దిలీప్‌ను చూశాడు. అతనికి ప్రాణం లేచి వచ్చినట్టుంది. "మీరా!" అని అతడు బరువు దింపుకుంటున్నట్టు నిట్టూర్చాడు.

"అవును నేనే! మూడు మూర్తులా సాక్షాత్తూ నేనే! అక్షరాలా నేనే అంటామనుకున్నాను గాని ఆ పదం ఇక్కడ వాడకూడదు" అన్నాడు దిలీప్.

"మీరొచ్చారు. ఇంక నాకేం భయం లేదు. పాపం! మాణిక్యానిక్కూడా ఇంకేం భయం లేదు" అన్నాడు రాజారావు.

"అసలు భయమన్నదెందుకొచ్చింది?" అన్నాడు దిలీప్.

"నరహరి మూలంగా ఆ పాప మాణిక్యాన్ని బెదిరించి దాన్నింట్లోంచి ఎత్తుకు పోయాడు. వాడితో పాటు రౌడీలను తీసుకొచ్చాడు. నేను అడ్డుకుంటే నా పీక పిసికారు. మనం వెళ్ళి మాణిక్యాన్ని కాపాడాలి. ఆ మూర్ఖులు దాన్నేం చేసినా చేస్తారు" అన్నాడు రాజారావు ఆతృతగా.

అతనికి తానెక్కడున్నదీ తెలియదు. రాజారావు చెప్పిన విషయాలు దిలీప్‌కు కొత్త సంగతులు. నరహరి మాణిక్యాన్ని ఎందుకు ఎత్తుకుపోయాడో అతనికి బోధపడలేదు. ఆ ఎత్తుకుపోవడానికి గల కారణం గురించి ఆలోచిస్తూ "ఎక్కడికి తీసుకెళ్ళారు?" అని అడిగాడు.

"అడవిలో బంగళాకట! మనం వెళ్ళాలి! అన్నాడు రాజారావు.

"అయితే సరే, వెళ్ళినట్టే లెక్క!" అన్నాడు దిలీప్ నిట్టూర్పు విడిచి.

"పదండి" అని తొందర చేశాడు రాజారావు. "ఇది సదరు అడవిలోని బంగళా! మరేం గాభరా పడకు" అన్నాడు దిలీప్. "ఇంతకీ మాణిక్యాన్ని వాళ్ళెందుకు ఎత్తుకుపోయారు?" అని అడిగాడు.

"ఎవడో త్రిశూలం మనిషట. వాడి ఆచూకీ చెప్ప మని నరహరి మాణిక్యాన్ని అడిగాడు. అది చెప్పనంది" అన్నాడు రాజారావు.

"చెప్పడానికి ఆమెకు తెలియదుగా" అన్నాడు దిలీప్.

"ఆ త్రిశూలం మనిషికోసమే పోలీసు ఇన్‌స్పెక్టర్ సుబ్బారావూ, ఛైర్మన్‌గారూ వాళ్ళూ వెతుకుతున్నారు. అతను కనిపిస్తే కాల్చేస్తారట. సుబ్బారావుకి లంచం కూడా ఇచ్చాడు" అన్నాడు రాజారావు.

"రాజుల సొమ్ము రాళ్ళపాలని ఊరికే అన్నారా మరి? ఛైర్మన్ ఈ ఊరికి మకుటంలేని మహారాజవు దామనుకున్నాడు. సుబ్బారావు రాతి యుగంలోని మనిషి. కొద్దిపాటి మార్పులతో ఈ నానుడి నిజ మైంది. అయితే లంచం ఎంత యిచ్చాడు?"

"వెయ్యి రూపాయలు!"

"శుభం! ఈ మొత్తం లెక్కల్లో పడినట్లే లెక్కించాలి" అని దిలీప్ తన మెదడులోని పద్దుల పుస్తకంలో సుబ్బారావు పేర వెయ్యి రూపాయలు జమ కట్టాడు. పాపనాశనం ప్రణాళిక విజయవంతం కావాలంటే ఏయే దుష్టుడు ఎంతెంత పాపిష్టి డబ్బు ఆర్జించినదీ కచ్చితంగా అణా పైసలతో అప్‌టుడేటుగా ఉండాలి.

"సుబ్బారావు ఆ త్రిశూలం మనిషిని కాల్చేస్తాడేమో. మనం వెళ్ళి సహాయం చేస్తే బాగుండును" అన్నాడు రాజారావు.

"వత్సా! దిగులు చెందకు. సుబ్బారావూ వాడి లాంటి వందమంది పంటులూ కలసి ఆ త్రిశూలం మనిషి

తలమీద నున్న పురాతన కేశరాజంలోని లవలేశాన్ని కూడా పెకిలించలేరు. ఎందుచేతననగా ఒక ధర్మ రాజు తమ్ముడు భీమరాజు. ఆ భీమరాజుకు ఏడుగురు కొడుకులు. ఆ ఏడుగురు కొడుకులూ కలసి ఎంత బల వంతులో నోటి లెక్కన కలిపి దాన్ని వెయ్యిపెట్టి గుణ కారం చేసి స్థానమంగున వచ్చిన అంకెకి లక్షపెట్టి హెచ్చవేసి దాన్ని జోడించితే ఎంత సంఖ్య వస్తుందో అంత బలవంతుడు త్రిశూలం మనిషి" అన్నాడు దిలీప్.

రాజారావు ఈ మాటలు విని నిశ్చేష్టితుడయ్యాడు. ప్రమాదం ముంచుకొస్తున్న వేళలో తమాషాగా మాట్లాడే వ్యక్తిని చూస్తే ఎవరికైనా అలాగే ఉంటుంది.

దిలీప్ తన వివరణను కొనసాగించాడు: "బలం రెండురకాలని లోకులంటారు. నే ననను. ఆ రెండు రకా లేమిటయ్యా అంటే ఒకటి భుజ బలం, రెండు బుద్ధి బలం. ఈ రెండున్నూ కాక ధర్మ బలం అని వేరే ఒక టుంది. అది చాలా అవసరం. ధర్మమార్గంలో సంచ రించేవాడిని లోకులు మెచ్చుకుంటారు. అదే వాడికి శ్రీరామరక్ష! ఇప్పుడు నీ సంభాషణలో, నా అభిభా షణలో, సుబ్బారావు అన్వేషణలో, ఛైర్మన్ కావేషంలో పేరొ్కనబడుచున్న త్రిశూలం మనిషికి భుజ బలం, బుద్ధి బలం, ధర్మ బలం వెరశి అన్ని బలాలూ ఉన్నట్టు అభిజ్ఞవర్గాల నిర్ణయం. అందుకే అతణ్ని ధర్మ రాజుగారి తమ్ముడు భీమరాజుగారి కొడుకులతో సరి పోల్చడమైనది. మంగళం మహత్. ఇంక తరువాత కార్యక్రమం నాచేత ఆలోచించబడును."

"మీరెవరు? మీరే త్రిశూలం మనిషా?" అని రాజారావు ఈ ధోరణివల్ల అనుమానించి అడిగాడు.

"నేనే అయినందువల్ల నాకొచ్చిన యిబ్బందిలేదు గాని, దుష్టులకి యిబ్బందే!" అన్నాడు దిలీప్.

వీళ్ళిద్దరి సంభాషణ యింతతో ముగించి, తరువాత జరిగిన కథ అందుకుందా మనుకుంటున్నాం. ఏమంటే కొద్దిసేపటి కిందట కథని చకచకా చెప్పుకుపోతామని మేము మా పాఠకులకు వాగ్దానం చేశాం. చెప్పిన మాటలు చేయకపోవడం, ఇచ్చిన వాగ్దానాలు నిలబెట్టుకొనకపోవడం ఒక్క రకం మనుష్యులకే చెందింది. మేము రాజకీయ వేత్తలం కానందువల్లా కనీసం ఎన్నికల్లో నిలబడి ఓడిపోవనందువల్లా చెప్పినమాట నిలబెట్టుకొన దలిచాం. అదీకాక భోజరాజు ముఖం చూస్తే కవిత్వం పుట్టుకొచ్చినట్టు దిలీప్ కథను కథనం చేయడం వలన అన్న మాటమీద అక్షరాలా నిలబడడం అబ్బుతుంది.

రాజారావు చెప్పిన దానినిబట్టి నరహరి తన రౌడీలతో కలసి మాణిక్యాన్ని ఎత్తుకుపోయి అడవిలోని బంగళాకి అనగా ఇక్కడికే తీసుకువచ్చినట్టు తెలిసింది కనుక ఆమెను వెదకడానికి దిలీప్ ఉద్యుక్తుడయ్యాడు. ఒక గదిలో ఆమె అలసిపోయి, రమారమీ తెలివితప్పి పడుకొని ఉంది. దుష్టులలోకల్లా దుష్టుడైన నరహరి ఆమెని పెట్టిన చిత్రహింసని ఇంతకుముందే మేము విపులంగా వర్ణించినందున, ఆ దుర్భర హింసకి లోనయ్యాక ఎవరైనా ఎట్టి పరితాపకరమైన స్థితిలో ఉంటారో మా పాఠకులు ఊహించుకోగలరు కనుక, ఆమె భౌతిక స్థితిని వర్ణించ దలచుకోలేదు.

'మబ్బులోని పొద్దు మనసులోని మాట, తెలియవు' అని సామెత చెప్పినట్టు మనోభావాలను మాత్రం స్పష్టం

చేయకపోతే పాత్రలు మానసిక స్థితి-పాఠకులకి తెలియడం కష్టం. అందుచేత వచ్చీ రాని మెలకువలో, అణగారిన భావాలు ఎగజిమ్ముతూ ఉండగా ఆమె ఏమని భావించుకున్నదీ తెలియచేయడం భావ్యమే.

మాణిక్యం యింతవరకూ ఎండ కన్నెరుగని సుకుమారి. తన వృత్తి ధర్మంవల్ల రాత్రి మేల్కొని పగలు నిద్రించుచూ ఉండడంవల్లనే యిది సంభవించలేదు. స్వతహాగా ఆమె పువ్వుల్లో పెరిగిన పడతి. విటులను ఆమె సుఖపెట్టినట్టే వాళ్లు ఆమెని సుఖపెట్టారు. ఎన్నడూ పరిశ్రమించి ఎరుగదు. ఇప్పుడు సరహరివల్ల ఇంత బాధకి లోనయ్యాక ఆమె ఈ కష్టమంతా తాను చేసిన పాపాల ఫలితమే అనే నిర్ణయానికొచ్చింది. చచ్చిపోయాక పాపులను యమభటులు బాధ పెడతారని మన మతం చెపుతుంది. ఆ మతమే పాపానికి ఫలితం ఈ లోకంలో అనుభవించడం జరుగుతుందనీ చెపుతుంది. మాణిక్యం ఎంత వారకాంత అయినా సంప్రదాయసిద్ధమైన మూఢ నమ్మకాల సాలెగూడును వదలిపెట్టి పోలేదు.

ఇకమీదట తాను మంచిగా సంచరిస్తే ఈ బాధలుండవని ఆమె నిశ్చయించుకుంది. అంతలో రాజారావు సమేతంగా దిలీప్ ఆ గదిలోనికి వచ్చాడు. ఆమె అసహాయ స్థితి అనుకంపం పుట్టించేటట్టుంది. దిలీప్ కన్ను లోలోపలనే చెమర్చింది. అనాటా బహిర్గతంగా ఎన్నడూ కంట తడిపెట్టలేదు. 'ఇదంతా నా మూలంగానే కదా!' అని అతడు బాధపడ్డాడు. రాజారావు కూడా ఆమె ఎడల సానుభూతిని మనస్సులో స్పష్టించుకుంటున్నాడు.

'మాణిక్యం!' అని అతి మృదువుగా ఆప్యాయంగా దిలీప్ పిలిచాడు. ఆమె ప్రక్కనున్న మోకాళ్ళమీద

కూర్చొని ముంగురులు సవరించాడు. ఆమె ఈ సాదర మైన సంబోధన విని సాగరంలాగ ఉప్పొంగింది. ఇంత వరకు అనుభవించిన బాధని మరచిపోయింది. దిలీప్ (అతని పేరు తనకు తెలియదు) తనను ఒక్కసారి స్పృశించి, ఒకమాటు ప్రేమతో పిలిచి లాలించితే చాలు. సర్వస్వాన్నీ ఇచ్చేయడానికి ఆమె సంసిద్ధంగా ఉంది. తాను కోరినప్పుడు అతడు అలా చేయలేదు. ఇప్పుడు తనంతట తానే ఊరడించుతూ లాలించాడు. అప్రయత్నంగా అదృష్టం ఫలించినప్పుడు ఆనందంగానే ఉంటుంది.

ఆమె అర్ధనిమీలిత నేత్రాలతో, అతి సంతోషంతో అతడి వంక చూసింది. దిలీప్ తన చేతితో ఆమె ముంగురులను సవరించాక, జేబు రుమాలును తీసుకొని ఆమె ముఖాన్ని తుడిచాడు. అతని చెయ్యి మంత్రహస్తంగా ఆమెపై పని చేసింది. ఆమె పరమానందంగా మళ్లా కళ్లు మూసుకుంది. ఇది చూసిన రాజారావు ఆమె నిస్సత్తువగా ఉందని భావించి, "మళ్లా తెలివి తప్పి పోయింది కాబోలు" అని దిలీప్‌తో అన్నాడు.

"లేదు. తెలివి వచ్చింది. ఇన్నాళ్లూ చేసిన పాపాలు ఎలాంటివో ఈ చిత్రహింస వల్ల తెలిసింది" అని ఆమె కళ్లు మూసుకొనే జవాబు చెప్పింది.

"పాపం! నా మూలంగా యెంత బాధల పాల య్యావు!" అన్నాడు దిలీప్.

"మీతో సుఖించలేనప్పుడు, మీవల్ల బాధపడడం లోనే ఆ సుఖాన్ని పొందినట్టు భావించుకున్నాను. మనసిచ్చిన వాళ్ళకోసం మరణించినా మంచిదే" అంది మాణిక్యం.

"అన్నకోసం ఏ చెల్లెలయినా త్యాగం చేయడం సహజమే!" అన్నాడు దిలీప్ ఆమె భావంలోని తప్పును సరిదిద్దుతూ. మాణిక్యం కన్నులు తెరచి అతడి వంక మౌనంగా చూసింది. ఆ మౌనం మణుగు బరువుంది.

"అవును మాణిక్యం! నేను నీకు సోదరుడివంటి వాణ్ణని యింతకుముందే చెప్పాను. ఎప్పటికీ నేను సోదరుణ్ణే!" అన్నాడు దిలీప్.

మాణిక్యం తన చూపుని దిలీప్ ముఖం నుంచి మరలించుకొంది. ఆమె రాజారావుని చూసింది. "మా యింట్లో నన్ను కాపాడబోయి మీరు ప్రాణాలమీదకి తెచ్చుకున్నారు. క్షమించండి" అని మనస్ఫూర్తిగా చెప్పింది.

"తల్లికోసం తనయుడు త్యాగం చేయడంలో గొప్పేముంది?" అన్నాడు దిలీప్.

ఈ మాటలు రాజారావుకీ, మాణిక్యానికీ ఒకే రకం ఆశ్చర్యం కలిగించాయి. "తల్లి ???" అని మాణిక్యం సంభ్రమంతో పలికింది. రాజారావు పలకలేదుగాని మనసులో ఇదే మాటను అనుకున్నాడు.

"అవును. నువ్వు ఇతని పెంపుడు తండ్రిగారి ఉంపుడుగత్తెవు. వరసకు తల్లివే అవుతావు. మన పాడు సాంప్రదాయం ప్రకారం మారటితల్లి సవతి బిడ్డల్ని సకల బాధలూ పెట్టాలి కనుక, నగల కోసం పదివేల రూపాయలు తీసుకొని ముప్పు తిప్పలూ పెట్టి, నీ యింటి చుట్టూ ఇతణ్ని తిప్పావు. అందుచేత నీ తప్పేం లేదు. మానవులు మంచిగా ప్రవర్తించితే వాళ్ళే దేవతలవుతారు. కాబట్టి నువ్వు మనఃపరివర్తన చెంది ఇతడి

నగలూ, పదివేల రూపాయిలు యిచ్చెయ్ !" అన్నాడు దిలీప్.

"ఇస్తాను" అనే అర్థం వచ్చినట్టు ఆమె తల ఊపింది.

"వెరీ గుడ్! ఇంతటితో ఇక్కడనుంచి మనం నిష్క్రమించుదాం. ఇప్పటికే మీరిద్దరూ ఈ దుష్టులవల్ల తగు మోతాదులో కష్టాలు అనుభవించారు. మీరిద్దరూ సేద తీరవలసిన అవసరముంది. ఇక్కడ యింకొక గంటలో నేను బాణాసంచా పేల్చి దీపావళి పండుగ చేసుకుంటు న్నాను. గంధకపు పొగ మీ వంటికి పడదు కనుక మిమ్మల్ని ఒక సురక్షిత స్థానంలో చేరవేయడం నా బాధ్యత" అని దిలీప్ చెప్పాడు.

వాళ్ళిద్దర్నీ తీసుకొని అతడు అరమైలు దూరం వెళ్లాడు. అక్కడ మరొక బంగళా ఉంది. అది దిలీప్ దే. ఈ ఊళ్ళో అతను ఆరిళ్లు అద్దెకు తీసుకున్నా డన్న సంగతి మేము ఈ గాథయొక్క మొదటి భాగ మైన 'త్రిశూలం'లోనే మొదట మనవి చేశాం. (చూ॥ పేజీ 51 రెండవపైను). ఆ ఆరిళ్ళలో ఇదొకటి. ఇక్క డకే దిలీప్ మాణిక్యాన్నీ, రాజారావునీ తీసుకొచ్చాడు.

దిలీప్ రాకని పసిగట్టిన ఒక తెల్లని ఆడ బొచ్చు కుక్క 'భౌ భౌ' అని సంతోషంగా అరిచింది. చెంగున దూకి పరుగెత్తుకొని దిలీప్ కాళ్ళవద్దకు వచ్చి, మీదకి ఎగిరి, అతణ్ణి ముద్దు పెట్టుకొంటూ అతడి అవ యవాలను నాకింది.

ఇది చూసి మాణిక్యం, 'నేను ఈ కుక్కనై పుట్టినా బాగుండేది !' అని అనుకొంది. దిలీప్ "రాణీ ! రాణీ !

ఉండు!" అని కుక్కని సముదాయించాడు. తన అతి థుల్ని చూసి, "ఈ బంగళాలో విశ్రాంతి తీసుకోండి" అని వారికి వేరు వేరు గదుల్ని చూపెట్టాడు.

ఇక్కడకు వస్తున్నప్పుడు అతడు ఆరువందల డెబ్భై నెంబరుగల చెట్టువద్ద ఒక్క అరనిమషంసేపు ఆగాడన్న సంగతి మా పాఠకులకు తెలియచేయనందుకు మన్నించ ప్రార్థన. బియ్యం వ్యాపారస్థుడు భీమయ్యగారి అసలు చిత్రాలు అక్కడ పడివున్న సంగతి ఒక్కసారి గుర్తుకు తెచ్చుకుంటే దిలీప్ ఎందుకు ఆగినదీ ఊహించుకో గలరు. ఆ చిత్రాలను అతడు తీసుకొన్నాక క్షణమైనా వృథా చేయలేదు.

ఈ బంగళాలో వాటిని భద్రపరచి, దిలీప్ మారు వేషం వేసుకున్నాడు. అతడు ముప్ఫై సంవత్సరాల యువకుడు అయినా ఈ వేషంలో అరవై సంవత్సరాల వృద్ధుడయ్యాడు. మారువేషం వేసుకున్నాక అతడు ఒక అగ్గిపెట్టెను తన జేబులో పెట్టుకొన్నాడు. చంచల ఇంటివద్ద సత్కార్య సమాజం కోసం తస్కరించిన డబ్బుని పదిలంగా ఇనప్పెట్టెలో పెట్టాడు.

వర్తమానకాలం అతి చక్కనిది. కాలుమీద కాలు వేసుకొని యింటి వద్దనుంచే ప్రపంచాన్ని పలకరించ వచ్చు. తిలకించవచ్చు. ఇందుకు అనువైన సాధనాల్లో టెలిఫోను ఒకటి. ఈ బంగళాకి టెలిఫోను సౌకర్య ముంది. దిలీప్ వెంటనే రంగనాయకులింటికి టెలిఫోను చేశాడు. సత్యనారాయణతో మాట్లాడాలని చెప్పాడు. సత్యనారాయణ టెలిఫోను అందుకున్నాడు.

"నమస్కారం. భవదీయుడు మాట్లాడుతున్నాడు" అని దిలీప్ చెప్పాడు.

"ఏమిటి విశేషాలు?" అని సత్యనారాయణ అడిగాడు.

"త్రిశూలం ఆసామీ అడవిలోని నరహరిగారి బంగళాలో..." అని దిలీప్ అంటూండగా "ఉన్నాడని నాకు తెలుసు" అన్నాడు సత్యనారాయణ.

"లేడు" అన్నాడు దిలీప్.

"ఆఁ లేడూ! మరెక్కడున్నాడు?" అని సత్యనారాయణ ఆత్రుతగా అడిగాడు.

"ఏవో తన పనులు చూసుకొందికి పోయాడు. మీ కంఠస్వరంలోని ఆత్రుత చూడగా అతణ్ని కలుసుకొనడానికి మీరు తహతహ లాడుతున్నట్టుంది" అన్నాడు దిలీప్.

"అవును. కలుసుకోవాలి."

"ఎందుకో నాకు తెలియచేయవచ్చు. అతడే ఆ హంతకుడని మీరు నిర్ణయానికొచ్చారా?"

"నేను ఆ నిర్ణయానికి రావడం రాకపోడం అనేవి వేరే విషయాలు. మీరు ఫోనుచేసి యిందాకా సమాచారం చెప్పారే-ఆ జక్కులదీవి దొంగలు త్రిశూలమే తమ నాయకుడని చెప్పారు."

"అబద్ధాలాడే తెలివితేటల్ని వాళ్ళకి ప్రసాదించినందుకు బ్రహ్మదేముణ్ణి మనిద్దరం జాయింటుగా అభినందించాలి" అన్నాడు దిలీప్.

"వాళ్లు అంతటితో ఆగలేదు. త్రిశూలమే రంగనాయకుల్ని హత్య చేశాడట. వాళ్ళిద్దరూ చూశారట.

"వాళ్ళ కళ్ళకి అద్భుత శక్తులున్నవన్నమాట. ఇందుకుకూడా బ్రహ్మదేముణ్ని అభినందించుదాం."

"జక్కులదీవి ఆభరణాలు త్రిశూలం వద్దనే ఉన్న వట."

"లక్ష్మీదేవి చంచలమైనదే. గాని జెట్ విమాన మెక్కి ఈ మధ్య ఒక చోటునుంచి యింకోచోటుకి మారుతున్నదనే విషయం నాకు తెలియదు" అన్నాడు దిలీప్.

"ఇన్ని కారణాలవల్ల ఆ త్రిశూలాన్ని కలుసుకోవా లనుకుంటున్నాను."

"అయితే యీ సంగతి త్రిశూలానికి తెలియ చేస్తాను."

"అతడు ఎక్కడున్నదీ మీకు తెలుసా ?"

"భవదీయుడికి అవసరమైన అన్ని విషయాలూ తెలు స్తాయని మీరు ఇప్పటికే తెలుసుకొని ఉండాలి."

"అయితే మంచిదే. మా యిద్దరికీ పరిచయం చేయండి. అయనెక్కడ కలుసుకోనడం ?"

"నరహరిగారి బంగళాకి మీరు ఒక్క అరగంటలో రండి."

"అతను అక్కడ లేడన్నారుగా !"

"ఇప్పుడు లేనిమాట నిజమే ! అయితే అరగంటలో అక్కడ ఉండే మాటా నిజమే !"

"అతడే హంతకుడైతే వచ్చి కలుసుకోడేమో !" అన్నాడు సత్యనారాయణ.

"అతడు హంతకుడని మీరు భావించితే చెప్పండి. ఆ సంగతి అతడికి తెలిస్తే తప్పక వచ్చి కలుసుకుం టాడు. ఏమంటే మీలాంటి బుద్ధిమంతులు కూడా పొర

బడ్డం త్రిశూలానికి యిష్టం లేదు. మీరు హంతకుడని అనుమానిస్తున్నందువల్లనే త్రిశూలాన్ని కలుసుకో వాలా? లేక హంతకుడ్నే కలుసుకోవాలా?"

"అతను హంతకుడు కాకపోతే ఆయన్ని కలుసుకో వలసిన అవసరం నాకు లేదు" అన్నాడు సత్యనారా యణ.

"అయితే మీరు అరగంటలో, అదే నరహరి బంగ ళాలో హంతకుణ్ని కూడా కలుసుకొనేటట్టు చేస్తాను. మీరు సపరివారంగా వచ్చి నన్నానందింప చేయ ప్రార్థన" అని దిలీప్ ఫోను పెట్టేశాడు.

చూడగా చూడగా అందరూ హత్యానేరాన్ని తనకు అంటగట్టడానికి ప్రయత్నిస్తున్నట్టుంది. ఈ అపవాదుని మొక్కగా ఉన్నప్పుడే పెకలించి పారవేయాలి. లేక పోతే తనకొచ్చిన యిబ్బంది లేదుగాని దుష్టులకు లాభం తాత్కాలికంగా కలిగేటట్టుంది. ఆ అవకాశం వాళ్ళకి యివ్వకూడదు.

ఈవిధంగా భావించి దిలీప్ హంతకుడి ఇంటికి టెలి ఫోను చేశాడు. హంతకుడి ముద్దుపేరు 'బుచ్చి.' అసలు పేరు రాజశేఖరం. ఇతడు ఆ ఊళ్ళో పేరుగలవాడే. ఆ పేరు చెడ్డ పేరైనా అతనికేం బాధలేదు. లోగడ యితడు ఒక దొంగనోట్ల కేసులో ఆరేళ్లు జైలు కెళ్లాడు. ఇది ఆరేళ్ళ కిందట. జైలుకి వెళ్ళేముందు అత డికి బంగారం వ్యాపారముండేది. జైలునించి తిరిగి వచ్చాక, ప్రజలలో బాహాటంగా బహిరంగంగా వ్యాపారం చేయలేక, చేయడానికి ముఖం చెల్లక

చాటుగా వ్యాపారం చేస్తున్నాడు. ఈ వ్యాపారంలో రంగనాయకులు ఇతని భాగస్వామి.

తాను జైలుకి వెళ్లి వచ్చిన కారణంగా తన ఇంట్లో కాక, రంగనాయకులింట్లోనే దొంగ బంగారం కరిగించడం ఇతను చేస్తున్నాడు. దిలీప్ రంగనాయకులికి ట్రూత్ సిరం ఇస్తున్నప్పుడు బుచ్చి నేలమాన్యంలోనే ఉన్నాడు. ఇంజెక్షన్ ఇచ్చాక, దిలీప్ రంగనాయకులి వద్ద డబ్బు తీసుకొని వెళ్లిపోయాడని మొదటి భాగంలో మనవిచేశాం. అతను వెళ్లిపోతూ ఉండగా నేల మాన్యంలోంచి బుచ్చి బయటకొచ్చాడు. ఎవరో ఆ గదిలోంచి బయటకు వెళ్లుతున్నట్టు అతనికి కనిపించింది. అందుచేత అతనెవరో తెలుసుకుందామని అనుసరించాడు.

దిలీప్ రంగనాయకులి మంచంవద్ద నుంచి వచ్చాక డి. యస్. పి. సత్యనారాయణకు ఫోను చేశాడని మా పాఠకులకి తెలిసిన విషయమే. ఈ సంభాషణను బుచ్చి పొంచి విన్నాడు. పాఠకుల సౌకర్యార్థం దిలీప్ డి. యస్. పీ కి ఫోనుచేసిన సమాచారాన్ని యిక్కడ మరొకసారి ఉదహరిస్తాము.

"భవదీయుడు మళ్లా తమకు పని కలిగిస్తున్నాడు. పాపం రంగనాయకులుగారు పశ్చాత్తాపం చెంది, ఈ పదేళ్ళలోగా తాము చేసిన పాపాలన్నీ తమకు విన్నవించబోయేటట్టున్నాడు. మీరు వెంటనే, అనగా నిజంగా వెంటనే వెళ్లితేనే ప్రయోజనముంటుంది.

ఇరవై అయిదు నిముషాలు దాటితే ఆయన మనస్సు మార్చుకుంటాడు."

పోంచి ఈ సమాచారం విన్న బుచ్చి మనస్సులో ఈ మాటలు ఈ విధంగా పొడుచుకున్నాయి. తన భాగస్వామి రంగనాయకులు ఎవరికి నిజం చెప్పేసినా తనకు అపాయమే ! అందుచేత అతణ్ని చంపేస్తే మంచి దని బుచ్చి భావించాడు. ఇరవై అయిదు నిముషాలలో ఇది కానివ్వాలి. వ్యవధి లేదు. కాబట్టి బుచ్చి రంగనాయకుల్ని చంపేశాడు. చంపుతుండగా నౌఖరు రాముడు చూశాడు. వీడు చూసినట్టు బుచ్చి చూడ లేదు. కాబట్టి వాడు బతికిపోయాడు. తను చూసినట్టు బుచ్చి అనుమానించకూడదని నౌఖరు రాముడు తాప త్రయ పడ్డాడు. కనుకనే నిద్రమాత్ర సగం వేసుకొని నిద్రపోయాడు. బుచ్చి రాముణ్ని కదిపి చూశాడు. ఒంటిమీద తెలివి లేకుండా వాడు నిద్రపోతున్నట్టు బుచ్చి కచ్చితంగా, నిశ్చయంగా భావించి మరింకే బాధా లేదనుకున్నాడు.

హత్య చేసిన తరువాత అతడు నేలమాళిగలోగల బంగారం పట్టుకుపోడానికి లారీ, బస్తాలు ఏర్పాటు చేయాలనుకున్నాడు. అందుకు భీమయ్య దుకాణానికి వెళ్లడం, అక్కడ రెండు లిస్తులపాటు దిలీప్ ఇతణ్ని చూడడం మొదలే మనవి చేశాము.

'హరిహరీ నారాయణ పాట' ఆంధ్రదేశంలోని అందరికీ తెలిసినదే. అందులో ఒక చరణం ఉంది. 'గొర్రెల గోత్రాలు గొల్లవాళ్లకి తెలుసు' అనేది ఆచరణం సారాంశం. అలాగే దుర్మార్గుల గోత్రాలు

దిలీప్‌కు తెలుసు. బుచ్చి రంగనాయకులూ కలిసి వ్యాపారం చేస్తున్నారని అతడికి విశదమే. ఈ బుచ్చి భీమయ్య గుకాణానికి వగర్చుకుంటూ రావడంలో ఏదో విశేషముంటుందని దిలీప్ ముందే భావించాడు. ఆ తరువాత రంగనాయకులు హత్యచేయబడ్డట్టు విన్నాక ఆ హత్య బుచ్చి తప్ప మరెవరూ చేసి ఉండరని కూడా నిశ్చయించుకొన్నాడు.

తన నిశ్చయం నూటికి నూరుపాళ్లు నిజమేనని తాను భావించినా, ఇంతవరకూ దీనిని సత్యనారాయణకు తెలియచేయలేదు. ఇప్పుడు హంతకుణ్ని పట్టి ఇవ్వడం తన ధర్మం. ఏమంటే 'తన్ను మాలిన ధర్మం, మొదలు చెడ్డ బేరం' అనేవి క్షేమంకరాలుకావు. హత్యానేరం అందరూ దిలీప్‌పైనే పెట్టడం తనకు వినోదకరమేగాని, బుద్ధిమంతుడు దేనినీ తెగేదాకా లాగడు. అందుకే ఇప్పుడు దిలీప్ హంతకుడింటికి ఫోను చేశాడు.

ఆ యిల్లు రాతిమేడ. చుట్టూ నాలుగువందల గజాల తోట ఉంది. ఎత్తైన ప్రహరీగోడ, ఆ గోడమీద ముళ్లతీగె మొదలైన కట్టు దిట్టాలున్నాయి. దీనికి తోడు గేటుముందో గూర్ఖా వాడు. ఆవరణలో భయంకరమైన వేటకుక్క మొదలైన కాపుదలలు కూడా ఉన్నాయి. ప్రహరీగోడపైనున్న ముళ్ళ తీగెల గుండా, రాత్రివేళ బుచ్చి ఎలక్ట్రిక్ కరంటు ప్రవహింప చేస్తాడని నేరగాళ్ల లోకంలో ప్రతీతి. అయితే ఇది కేవలం అతిశయోక్తే. లోకం ఇరుగో పులంటే అదుగో తోక అంటుంది. బుచ్చి తన యింటికి బలమైన పహారా పెట్టాడంటే తీగెలలోకి కరంటు పంపించాడు అని

మూఢులు భావించారు. ఇది శుద్ధ ఊహాగానమే అని దిలీప్ స్వానుభవం వల్ల తెలుసుకున్నాడు.

ఎందుకంటే, చీమలు దూరని చిట్టడవిలో, కాకులు దూరని కారడవిలో ఒకొక్కప్పుడు, అవసరం కొద్దీ తనలాంటి వాళ్లు ప్రవేశించి, మళ్లా సురక్షితంగా మరలి రావలసి ఉంటుంది. బుచ్చి యిల్లు అటువంటి దుర్గమ దుర్గం అయితే దానిలో ప్రవేశించడం, బయటికి రావడం మొదలైనవి తాను సాధకం చేయడం మంచిది. అందుచేత ముందుజాగ్రత్త కోసం దిలీప్ చాలా కాలంనుంచీ, షైరు వెళ్లి వచ్చినట్టు, బుచ్చి యింటిగోడని లంఘించి, ఆవరణలోనున్న తోటలో విహరించి, హాయిగా మళ్లా గోడ ఎక్కి కిందికి దూకి పోతూ ఉండేవాడు. దిలీప్ ఆ యింటి గేటుముందున్న గూర్ఖా కళ్లు ఎలా కప్పినదీ, భయంకరమైన వేట కుక్కని ఎలా మచ్చిక చేసుకున్నదీ తరువాత తెలియ చేస్తాం.

బుచ్చి గురించి ఇప్పటిదాకా చాలా విపులంగా చెప్పాం గాని ఒక్క ముఖ్య విషయం యింతవరకూ మనవి చేయనందుకు మా పాఠకులు మమ్మల్ని మన్నిస్తారని తలుస్తాం. బుచ్చి అసలు పేరు రాజశేఖరం అని మొదటే చెప్పివేశాం. ఈ గాథలోని ఒకానొక ప్రముఖ పాత్ర పేరుకీ ఈ పేరుకీ పోలికలున్నట్టు చాలామంది పాఠకులు గమనించే ఉంటారు.

చంద్రశేఖరం, రాజశేఖరం అనే నామవాచకాల్లో 'శేఖరం' అనే పదం క. సా. గు. వలె ఉంది. ఈ యిరువురి వ్యక్తులకీ ఈ ఒక్కపదం వల్లనే కాక రక్త సంబంధమైన బంధుత్వం కూడా ఉంది. బుచ్చి చైర్మన్

యొక్క పినతండ్రి కొడుకు. ఇద్దరూ పందెం వేసుకొని మరీ పాతకాలు చేస్తున్నట్టు ప్రవర్తిస్తున్నారు.

బుచ్చి యింట్లో టెలిఫోను గణగణ మ్రోగలేదు. ఏ టెలిఫోనైనా 'గణగణ' మ్రోగుతుందనే రచయితలు రాస్తారు. ఈ టెలిఫోన్ 'క్రింగ్ క్రింగ్' అని మ్రోగింది. అది మ్రోగుతున్నప్పుడు ఆ గదిలో ముగ్గురు వ్యక్తులున్నారు. ఒకరు బుచ్చి, రెండవ వ్యక్తి అతని ఉంపుడుగత్తె మల్లి పువ్వు, మూడవ సాక్షీ మురళీధర్.

చంచల యింట్లో తస్కరించిన జక్కులదీవి ఆభరణాలను, బుచ్చికి అమ్మజూపడానికే మురళీధర్ యిక్కడికి కొచ్చాడని మేము చెప్పక్కర్లేకుండానే మా పాఠకులు ఊహించి ఉంటారు. బుచ్చీ మురళీధరూ ఆ వ్యాపారం చేస్తూ ఉండగా, మ్రోగిన టెలిఫోనును మల్లి పువ్వు ఎత్తింది. 'అల్లో' అనే మాటను రిసీవరులోనికి ఒలక పోసింది.

ఈ మాట ఒక్కటే కాక, 'ఇరవై వేలు ఇవ్వండి' అనే మురళీధర్ మాటను "ఉండు మురళీధర్ ఎవరో ఫోన్ చేస్తున్నారు" అనే బుచ్చి వాక్యాలనుకూడా- టెలిఫోను యంత్రం చాలా నమ్మకంగా దిలీప్ చెవిలో వినిపించింది.

ఈ మాటలు విన్నాక దిలీప్ ఒక లిప్తసేపు మాత్రమే ఆలోచించి, అంతా అవగాహన చేసుకున్నాడు. జక్కులదీవి ఆభరణాలు చంచలవద్ద లేవని డి. యస్. పి. ఫోనులో చెప్పడం, ఇక్కడ 'ఇరవై వేలు' 'మురళీధర్' అనే పదాలు వినిపించడం జరిగాక, ఏ మాత్రం మేధస్సున్నవాడైనా రెండురెళ్లు ఎంతో పోల్చుకో గలడు.

మల్లి పువ్వు మరోకసారి 'అల్లో' అంది. దిలీప్ "మల్లీ! బుచ్చి లేడూ?" అని అడిగాడు. "చంద్రం బావగారా! ఉండండి పిలుస్తాను" అని దిలీప్‌కు చెప్పి 'మీ అన్న గారు' అని బుచ్చితో ఆమె చెప్పింది. ఆతృతతో బుచ్చి టెలిఫోను అందుకొని "ఏం అన్నయ్యా?" అని అడిగాడు.

"బుచ్చీ! ఏం చచ్చుపని చేశావురా!" అని దిలీప్ చంద్రశేఖరం గొంతుకతో అన్నాడు.

"అదేమిటన్నయ్యా!"

"ఆ రంగనాయకుల్ని ఎందుకు చంపేశావు?"

"ఈ సంగతి నీకెలా తెలుసు?"

"ఒక్క నాకే కాదు. డి. యస్. పి. గాడికి కూడా తెలుసు."

"ఆఁ! డి. యస్. పి. కి తెలుసా?"

"ఆ మాటకొస్తే వాడే నాకు చెప్పాడు."

"........."

"ఒరేయ్! నా మాటలు వినబడుతున్నాయా?"

"........."

"నిన్ను పట్టుకోవాలని చూస్తున్నాడు."

"సాక్ష్యంలేదే!"

"నీ మొహం. చంపిన గాభరాలో చుట్టుప్రక్కల ఎవరున్నదీ చూసి ఉండవు!"

"డి. యస్. పి. గాడికి ఎవరో డాక్టరు వెధవ ఫోను చేశాడు, రంగనాయకులు నిజం చెప్పేస్తాడని. వాడుగాని చూశాడా?"

"చూసినా చూసుంటాడు. అది సరేగాని, మీ యింట్లో నువ్వుండడం మంచిది కాదు. పోలీసు లొస్తారు."

"కుక్కా, గూర్ఖా, ఉన్నారే."

"లంకిణీ కాపున్నా లంకలో ఆంజనేయుడు ప్రవేశించాడురా!"

"మరేం చెయ్యమంటావు?"

"అడవిలో నరహరి బంగళాలేదూ, అక్కడికిరా. నువ్వొచ్చేశావంటే-మరింక నువ్వు లోకుల కళ్ళపడకుండా చూస్తాను" అన్నాడు దిలీప్.

"అలాగే అన్నయ్యా!" అని బుచ్చి టెలిఫోను పెట్టేశాడు. దిలీప్ కూడా ఫోను పెట్టేసి, అడవిలోని బంగళాకి వెళ్ళే ప్రయత్నంలో ఉన్నాడు. ఈ పై సంభాషణలోని ఆఖరి మాటల్లో అతడు నిజమే చెప్పాడు. బుచ్చి అడవిలోని బంగళాకి వస్తే మరింక లోకుల కళ్ళపడకుండా జైల్లోనే ఉండడానికి ఏర్పాట్లు చెయ్యాలి.

## 5

చైర్మన్ చంద్రశేఖరం, కౌన్సిలర్స్ రంగనాయకులూ, నరహరీ, వాళ్ళంతటవాళ్లే త్రిశూలం పని పట్టడానికి బంగళాకెళ్లే దారి పట్టారు.

డి. యస్. పి. సత్యనారాయణనూ, బుచ్చినీ అక్కడకి రమ్మని దిలీపే చెప్పాడు. తాను కూడా ముసలి వేషంలో అక్కడికి వెళ్లాడు.

ప్రముఖ పాత్రలన్నీ ఒకే ఒక రంగస్థలం మీదకి చేరుకుంటున్నవి కనుక, ఈ గాథలోని పతాక సన్ని

వేశం యిఁక ప్రారంభ మవుతున్నదని మా పాఠకులు భావించవచ్చు. ఇదే సినిమా చిత్రమైతే ఇంక కొద్ది సేపటిలో, ముష్టాముష్టి, బాహాబాహి యుద్ధం బాహాటంగా జరుగుతుందని కూడా కొందరు ఊహించవచ్చు. హాలీవుడ్ చిత్రమైనా, ఆంధ్రా చిత్రమైనా, ఆఖరి ఘట్టంలో తగుమాత్రం యుద్ధం చూపెట్టడం రివాజే. అయితే ఈ గాథలో అటువంటిదేమీ క్లయిమాక్స్ ఘట్టంలో, జరుగలేదని సవినయంగా తెలియ చేస్తున్నాం.

అడవిలోని బంగళా ముందు చైర్మన్ కారు ఆగింది ఆ బంగళాలో అప్పుడే దిలీప్, చేతికీ కిటికీ ఊచకీ బేడీలు వేసుకొని, వీళ్లు వచ్చేలోపున కాలం ఎందుకు వృథా చేయడమని నిలబడే నిద్ర పోతున్నాడు. వాస్తవానికి ఇతను నిద్ర పోడానికి ముందు కొంత కథ జరిగింది. అది క్రమేణా వివరిస్తాము.

"ఈ త్రిశూలం వెధవ ఉన్నాడా పారిపోయాడా ?" అని సందేహం వెలిబుస్తూ చైర్మన్ బంగళాముందు కారు దిగాడు. "పారిపోయినా పోతాడు. అసాధ్యపు ముండాకొడుకు !" అంటూ పురుషోత్తం నిజాన్ని వెలిబుచ్చాడు. "ఊరుకో పురుషోత్తం" అని నరహరి మందలించాడు.

వాళ్లు లోనికి ప్రవేశించడానికి ముందే దిలీప్ నిద్రని ఉపసంహరించుకొని, "హా ప్రియా ! నరహరీ ! నన్ను ఒంటరిగా విడిచి ఇన్నాళ్లు ఎక్కడికి పోయావు ? కతిపయ సంవత్సరాల వియోగంవల్ల నేనెంత మసిలివాణ్ణి అయిపోయానో చూడు !" అని జాలిగా వాపోయాడు.

అందరూ దిలీప్‌ను చూసి ఆశ్చర్యపోయారు. వేసిన బేడీలు వేసినట్లే ఉన్నాయి. అయినా గుర్తు పట్టనే

పట్టలేనంత మార్పు. ఒక్క కంఠస్వరం తప్ప త్రికాలం పోలికలే కనబడడంలేదు.

"వాడేనా వీడు!" అని పురుషోత్తం విస్మయం చెందాడు.

"నాగురించి మీరు అన్ని వేళల్లోనూ ఆలోచిస్తారు. అందుకు కృతజ్ఞుణ్ని. మీరు నా విషయంలో యింత శ్రద్ధ చూపుతున్నందుకు ప్రతిఫలంగా నేను మీ సౌకర్యాలు చూడాలి. నల్లరంగయ్యా! ఈ దగాకోరు దగుల్బాజీ మనుషులు కూర్చుందుకి కుర్చీలు వేయి" అన్నాడు దిలీప్.

"చింత చచ్చినా పులుపు చావదు! ఇంతసేపటి నుంచి నిలబడి కాళ్లు నొప్పెడుతున్నా, వెధవనోరు ఎలా ఉందో చూడు" అన్నాడు పురుషోత్తం.

దీనికి ఎవరూ సమాధానం చెప్పలేదు. నల్లరంగయ్య ఆ గదిలోనే ఉన్న మూడు కుర్చీలు తీసుకొచ్చి దగ్గరగా వేశాడు. ముగ్గురూ ఆసీనులయ్యారు. నాలుగో కుర్చీ అక్కడలేదు. వాళ్ళ ముగ్గురూ కూర్చున్నాక, "మీరు సుఖాసీనులయ్యారు కాబట్టి, యింక మిమ్మల్ని కష్టపెట్టవచ్చు. నన్ను నాలుగు కాలాలపాటు నిలబెట్టడం మీ సదుద్దేశం కావచ్చు. అయినా, మీరు కూర్చున్నాక, మీ ముందు నేను నిలబడడం మంచివాళ్ళ దృష్టిలో బాగుండని విషయం. ఇక్కడ నేను తప్పించి మరో మంచివాడులేడని మీరు అనుకుంటే తప్పులేదు గాని, మరొక వ్యక్తికూడా ఉన్నాడు. అతడు మీ ప్రతి చేష్టనీ, మాటనీ కనిపెడుతూనే ఉంటాడు. కనుక..." అని దిలీప్ చెప్పాడు.

ముగ్గురూ దిక్కులు చూశారు. ఈ బంగళాలో మరొక వ్యక్తి ఎవరున్నారు? అతను ప్రతిచేష్టా కనిపెట్టే

వ్యక్తా ? దిలీప్ అర్థంలేని వాగుడు వాగుతాడని వాళ్ళ నమ్మకం కాబట్టి, దీనికి అట్టే ప్రాధాన్యత యివ్వకూడదని కూడా వాళ్లు వెంటనే భావించారు.

"నల్లరంగయ్యా ! రెండుకుర్చీలు తీసుకొచ్చి వేయి. అయితే నువ్వెప్పుడైనా పాత జానపద గాథలు విన్నావా? అందులోని బ్రహ్మ రాక్షసులు మొదలైనవి వాళ్లు కథానాయకుణ్ని తమ గుహలోనికి తీసుకొనివెళ్లి, 'నాయనా! నువ్వు ఏ దిక్కుకైనా వెళ్లుగాని, ఫలానా ఉత్తరం వైపు వెళ్ళకు' అని వారిస్తాయి. ఈ బంగళా సదరు చంఢాలపు గుహవంటిది. నేను బ్రహ్మరాక్షసినని ఈ ముగ్గురు మూర్ఖుల అభిప్రాయం. కుర్చీలు వేసేవరకూ నువ్వే కథానాయకుడివి కనుక నువ్వు ఎడమచేతి వైపు నున్న గదిలోనికి తప్పించి మరెక్కడికైనా వెళ్లి, రెండు కుర్చీలు తీసుకురా!" అని దిలీప్ చెప్పాడు.

దుష్టులు ముగ్గురూ ఈ మాటలు విని మరీ కలత చెందారు. 'వీడేమిటి ? ఇలా ఆజ్ఞాపించేటట్లు మాట్లాడ మేమిటి ? ఎడమచేతివైపు గదిలోనికి ఎందుకు వెళ్ళ వద్దంటున్నాడు ?' అని వాళ్లు అర్థం కాని అవస్థలో పడ్డారు. నల్లరంగయ్య ఏం చేయాలో తోచక క్షణం సేపు నిలబడిపోయినా; దిలీప్ ఏ గదిలోకి తనను వెళ్లొద్దన్నాడో ఆ గదివైపుకే వెళ్లాడు. చెయ్యవద్దని వారించిన పనినే చేయబోవడం మానవనైజం. స్వానుభవం పైనగాని సాధక బాధకాలను ఎవరూ తెలుసుకోవలచు కోలేరు.

ఎడమచేతివైపునున్న గది తలుపుతోసి, లోనికి చూసి, వెంటనే ఎలక్ట్రిక్ షాకు తగిలినవాడు చేతిని అప్రయత్నంగా వెనుకకు లాగేసుకొనేటట్లు, నల్ల రంగయ్య ఒక్క ఊపులో వెనుకకు వచ్చేశాడు. వాడి

గాభరాకీ, పాఠకుకీ తక్కిన వాళ్లుకూడా విస్మయం చెందారు.

"ఏం రంగయ్యా! ఏం జరిగింది. కొంపతీసి మాణిక్యం చచ్చిపోలేదు కదా ?" అన్నాడు నరహరి. ఈ గదిలోనే వాళ్లు యింతకుముందు మాణిక్యాన్ని పరుండబెట్టారు.

నరహరి అడిగిన ప్రశ్నకి నల్లరంగయ్య జవాబు చెప్ప లేదు. పురుషోత్తం భయపడుతూ, భయపడుతూ లేచి, ఎడమచేతివైపునున్న గదివద్దకు వెళ్ళిచూసి,నల్లరంగయ్య ఎంత విభ్రాంతి చెందాడో అంత డిటో డిటో విభ్రాం తితో నోటమాట లేక బయటకు వచ్చాడు. అతని కళ్లు తిరిగాయి. వళ్లు జోగింది. నరహరీ, చైర్మనూ కూడా ఆ గది వద్దకు వెళ్లి చూశారు. వాళ్లుకూడా మూర్ఛపోయి నంత సంభ్రమం చెందారు.

దీనికి తగినంత కారణం లేకపోలేదు. నరహరి భయ పడినట్టు ఆ గదిలో మరణించిన మాణిక్యం లేదు. ఆ మెన్నీ, రాజారావుని నిలీవ్ తన బంగళాకు తీసుకు వెళ్లిన విషయం మా పాఠకులు ముందే తెలుసుకున్నారు. మరణించిన మగువని మాడడం కన్నా, సజీవంగానున్న నూపర్నెంటును మాడడం వల్లనే నీళ్ళందరిలో మతి పోయినంత మహోపద్రవం ఘనీభవించింది.

ఆ గదిలో డి. యస్. పి సత్యనారాయణ కూర్చు న్నాడు !!

ఇది ఎలాగ సంభవించిందంటే, చైర్మనేత్యాది చతాక్కీ వ్యక్తులు అక్కడికి రావడానికి ముందు జరిగిన దానినీ, మా పాఠకులలో ఉత్సాహాన్ని - ఉత్కంఠనీ కలిగించడానికిగాను మేము చెప్పనిదానినీ, యిక్కడ చెప్పాలి.

'అరగంట సేపు పోయాక, అడవిలోని బంగళాకి రండి. హంతకుడితో మీకో భేటీ ఏర్పాటు చేస్తాను' అని భవదీయుడు చెప్పినా, డి. యస్. పి. సత్యనారాయణ అంత కాలహరణం చేయలేదు. వెను వెంటనే బయలుదేరాడు. వెంటనే బంగళా చేరుకున్నాడు.

అతను అక్కడికి ప్రవేశించడానికి ఒక్క నిముషం ముందే దిలీప్ కూడా రావడం జరిగింది. వచ్చీ రాగానే అతడు తన జేబులోని బేడీలను తీసి తన ఎడమ చేతికీ, కిటికీ ఊచకీ వాటిని వేసుకొన్నాడు. అంతలో డి. యస్. పి. అక్కడికి వచ్చాడు.

"స్వాగతం సత్యనారాయణగారూ! స్వాగతం!!" అని మందహాసం చేస్తూ దిలీప్ ప్రత్యుత్థానం చేశాడు.

"ఎవరు మీరు?" అని సత్యనారాయణ అడిగాడు. ఈ ముసలివాడు త్రిశూలం మనిషా? హంతకుడా? బేడీలలో ఉండడం చూస్తే, అనుమానాస్పదంగానే ఉన్నాడు.

"నేను భవదీయుణ్ని."

"భవదీయుడు!"

"మూడు మూర్తులా!"

"ఎవడు మిమ్మల్ని బంధించాడు?"

"ఒకడు బంధిస్తే బంధింపబడడం మన జాతకంలో లేదు. 'కరిరాజున్ బిసతంతు సంతతులచే కట్టన్!' అని ఏనుగు లచ్చన్న అన్నాడనుకోండి."

"మీరు నిజంగా భవదీయుడేనా? ఇంతకు ముందు నాకు ఫోను చేశారే?"

"చేశాను. ఇక్కడకొస్తే హంతకుడితో మీకు ఇంటర్వ్యూ యిప్పిస్తానని చెప్పాను."

"అయితే మీరు భవదీయుడే-సందేహం లేదు. అయినా నాకు నమ్మకం కలగడానికి మరికొన్ని ఆన వాళ్లు చెప్పండి" అని సత్యనారాయణ అడిగాడు.

దిలీప్ చెప్పాడు. "జక్కులదేవి ఆభరణాల గురించి ఫోను చేశాను?"

"అవి చంచల దగ్గర లేవు లే. మీరు పొరపడరని నాకు తెలుసు. అయినా..."

"ఆ ఆభరణాలు ఆమె యింట్లోనే ఉన్నాయి. ఉంటాయి. సత్యహరిశ్చంద్రుడు చచ్చిపోతూ, నా కిచ్చిన వారసత్వం నేను పోగొట్టుకోను. ఆ ఆభరణాల కోసం రేపు ఆమె యింట్లో వెతకండి."

"ఇవాళే వెతికితే?"

"వెతకొచ్చు. అయినా మీరు పోలీసులు. వారంటు లేనిదే యిల్లు సోదా చేయకూడదు. ఆఫీసు టైము అయి పోయింది. వారంటు తీసుకోవద్దూ?"

"అవును. ఇంతకీ హంతకుడు..."

"ప్రవేశపెట్ట బడును."

"అతనెవరు?"

"తినబోతూ రుచి అడగకూడదంటారు గాని, అడ గడం మంచిదే. మన తత్త్వానికి పడని రుచి అయితే ముందుగానే సంసిద్ధ పడవచ్చు. అయినా హంతకుడు కోరకరాని కొయ్య కనుక, అతడి పేరూ, రూపూ ఒకేసారి మీకు ఎరుకపరచడం మంచిది."

"సరే-మీ బేడీలు తొలగించనా?"

"వద్దు. కారణం లేనిదే నేను ఏపనీ చేయను. ఇలాగే ఉండనీండి. నా ప్రియమైన శత్రువులు నన్ను అనురాగ బంధంతో కట్టి పడవేయలేక వీటితో బంధించారు.

వాళ్లే ముచ్చట తీర్చడానికి, ముద్దు చెల్లించడానికి కట్టు పడ్డాను. ఇంక ఏ నిముషంలోనైనా వాళ్లు రావచ్చు. వచ్చాక వాళ్లు ఆశాభంగం చెందడం నాకు సుతరామూ యిష్టం లేదు."

"ఎవరు మీ శత్రువులు ? మీ మాటల్ని పట్టిచూస్తే మీరే త్రిశూలం అనుకొంటాను. అతణ్ని నరహరికి అప్పచెప్పినట్టు మా సత్యరాజు చెప్పాడు" అన్నాడు సత్యనారాయణ.

"మీ పరిశోధనా శక్తికి నా అభివందనాలు. మీరు న్యాయం జరిపించడానికి తోడ్పడే ఆఫీసర్లు. అందు చేత మీ దగ్గర ఏమీ దాపరికముంచడం మంచిదికాదు."

"అయితే..." అని సత్యనారాయణ సంధిగ్ధావస్థలో పడ్డాడు. 'ఇప్పుడేం చేయాలి ?' అని అతని ఆలోచన.

"న్యాయానికి చెవులేగాని కళ్లులేవని ప్రతీతి. కాబట్టి మీరు కళ్లు మూసుకొని, చెవులు తెరచుకొని ఇప్పుడు జరగబోయే నవరసభరితమైన నాటకాన్ని పక్కగదిలోంచి ఆలకించండి. అవసరమొచ్చాక మీరు అధికారరీత్యా ప్రవేశించి భరత వాక్యం పాడండి" అన్నాడు దిలీప్.

"పక్కగదిలోనా ?"

"అవును. మిమ్మల్ని సపరివారంగా దయచేయమని ప్రార్థించాను. మీరు సిరికిం జెప్పడు శంఖుచక్రయుగ మున్ చేదోయి సంధింపడే అన్నట్టు వచ్చారు."

"పరివారం అరగంటలో వస్తుంది."

"శంఖుచక్రాలకి ప్రత్యామ్నాయంగా, పిస్తోలూ, బేడీలు పట్టుకొచ్చారా ?"

"వచ్చాను."

"అవును. కర్ణుడి సహజ కవచ కుండలాలలాగ, అవి హమేషా మీవద్ద ఉంటాయని భావించవచ్చు. అది సరే కాని, మీరు ఏ వాహనంపైన వచ్చారు?"

"కారులో."

"ఆ కారుని బంగళా బయటనే ఆపారా ?"

"అవును."

"దూరంగా తీసుకెళ్ళి, ఇక్కడకి వచ్చేవాళ్ళకి అనుమానం కలుగకుండా, పసుల కంటపడకుండా ఆపండి. అది మీ విజయానికి అత్యవసరం" అన్నాడు దిలీప్.

మారు మాటాడకుండా సత్యనారాయణ ఈ సలహాని ఆచరణలో పెట్టాడు. తరువాత బంగళాలోనికి వచ్చి, ఒక గదిలో మాటువేసి కూర్చున్నాడు.

నిలబడే దిలీప్ నిద్రపోతున్నాడు.

అంతట కతిపయ నిముషాల తరవాత ఛైర్మన్ కారు బంగళా ముందు ఆగింది. ఆ తరువాత కథని క్రమశః మా పాఠకులు చదివారు. అయితే ఒక సంశయం వారిని అతి కొద్ది పరిమాణంలో బాధించవచ్చు. 'సత్యనారాయణ ముందుగా వచ్చి, ఈ గుప్తులు ఎందుకు కొద్ది కాలం జాలం చేశారు?' అనేదే ఆ సంశయం అనిమాకు తెలుసు.

ఛైర్మన్ చంద్రశేఖరం ఇత్యాది నీచులు డి.యస్.పి. సత్యనారాయణకన్నా ముందుగానే అడవిలోని బంగళాకు బయల్దేరినా, వాళ్లు ఆలస్యంగా రావడానికి గల కారణం ఏమిటంటే, త్రోవలో వాళ్ల కారు చమురు లేక ఆగిపోవడం; ఆ తరువాత దాన్ని తోసుకొని వెళ్లి పెట్రోలు కొట్టించడం వంటి మైనరు విషయాల పరంపర.

ఇక ప్రస్తుతానికి వద్దాం.

ఊరేగింపులాగ ఒక్కొక్కడూ వెళ్ళి ఎడమచేతివైపు గదిలోని డి. యస్. పి ని పర్శించి వచ్చేశాక, అంతకు రెట్టింపు విభ్రాంతిని పొందారు. వీళ్ళ దృష్టి, మనస్సూ సత్యనారాయణ గురించే లగ్నమైనప్పుడు దిలీప్ తన చేతి కున్న బేడీలను తొలిగించుకొని, జోగుతున్న ఒక్కొక్కణ్ణీ పట్టుకొని కుర్చీల్లో కూర్చోపెట్టాడు. వాళ్ళు దిలీప్ బేడీలను తొలిగించుకోవడం గురించి తామంతా ఉమ్మడిగా ఒక పీడకలను కంటున్నట్టు భావించారు.

"మూర్ఖులారా! మూర్ఛపోకండి. మీ ముఖాలమీద జల్లడానికి తగినన్ని నీళ్ళు యిక్కడ లేవు. నేను పంచ వర్ష ప్రణాళిక వాటికి అర్జీపెట్టి, ఇక్కడ ఒక ట్యూబ్ నూయి తవ్వించేదాకా మీరు స్పృహ తప్పకుండా ఉండ ప్రార్థన" అని దిలీప్ వాళ్ళని హెచ్చరించాడు.

"అయ్యా సత్యనారాయణగారూ! తమరు దయచేసి బయటకు వచ్చి మా సమావేశానికి అధ్యక్షత వహించ వలసిందిగా కోరుతున్నాను. చేతులు తట్టండిరా అబ్బా యిలూ!" అని చైర్మన్ బృందానికి చెప్పాడు. అతడు కోరినట్టే వాళ్ళు చేతులు తట్టలేరుగాని, గంభీరంగా సత్యనారాయణ మాత్రం హాలులోకి వచ్చాడు.

"వీళ్ళు కరతాళధ్వనులు చేయనందుకు కడుంగడు పరితపిస్తున్నాను. అయితే ఎందుకో మిమ్మల్ని చూడ గానే వీళ్ళ కరచరణాలు ఆడడంలేదు. అంతమాత్రాన వీళ్ళు నేరస్థులనిగాని, వీళ్ళ చతుష్టయంలోని ఒకడైన రంగనాయకులి హత్యకీ వీళ్ళకీ ఎడతెగని సంబంధం ఉందనిగాని, మీరు భావించకూడదు. వీళ్ళు స్వచ్ఛమైన అచ్చాణీలు" అని దిలీప్ చెప్పాడు.

అతను తప్పించి మరెవరూ మాట్లాడలేదు. మాట్లాడే స్థితిలో కూడా లేరు. హత్యకేసుకీ తమకూ సంబంధం లేదని ఇతను చెప్పినా, పెడసరపు మాటలాడే వ్యక్తి కనుక, ఇది సత్యనారాయణ నమ్ముతాడో లేదో అని వాళ్లు అనుమానిస్తూనే ఉన్నారు.

“సత్యనారాయణగారూ! మేము నిర్జనసీమలో సమావేశం కావడానికి ప్రత్యేకమైన కారణం లేదు. భూమి గుండ్రంగా ఉంది కాబట్టి, ఏ ప్రదేశంలో సమావేశమైనా ఒకటే అని భావించాము.

“వీళ్లు పెద్దమనుషులు. ఆ సంగతి నేను వేరే చెప్పక్కర్లేదు. వీళ్లు బడిలో చదువుకొనే రోజుల్లో ప్రతి మాస్టరూ వీళ్ల సత్ప్రవర్తనకు ముగ్ధుడై ఇరవైతో మిన్నగ మార్కులు వేసేవాడని కొంచెం పరిశోధిస్తే తెలిసే సంగతి. ఆ పరిశోధన అంతటితో ఆపితేనే మంచిది. వీళ్ళ తండ్రులు ఊళ్లో పలుకుబడి కలవాళ్లు కాబట్టి, మాస్టర్లు భయపడి అటువంటి మార్కులు వేసేవారని ఎవరైనా మరికొంచెం పరిశోధనవల్ల తేల్చి చెప్తే, అది వాళ్ళ వ్యక్తిగత అభిప్రాయంగానే మనం జమకట్టుకోవాలి. అది సత్యదూరం కాదనే విషయం వేరే సంగతి” అన్నాడు దిలీప్.

సత్యనారాయణ ఈ మాటలు శ్రద్ధగా వింటున్నాడు.

ముళ్ళకంచె చుట్టబెట్టి దానిపైన తను ముగ్గుర్ని కూర్చోపెట్టినట్లు గుష్టులు అసౌకర్యంగా కూర్చున్నారు.

“ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే, వీళ్లు మంచివాళ్లు. బాగా ఆర్జిస్తున్న వాళ్లు. ఏ పద్ధతిలో ఆర్జిస్తున్నదీ మనం పట్టించుకోవలసినది కాదు. వీళ్లు ఆర్జిస్తున్న

డబ్బులో కొంతభాగం చాలా గోప్యంగా దానం చేయ దలిచారు. నేను సత్కార్య సమాజం అనే ఒక సంస్థని స్థాపించాను. దానికి విరాళాలు యివ్వడానికి వీళ్లు సంకల్పించి నన్ను రప్పించారు. నేను వీళ్లు యిచ్చే డబ్బు నిరాకరించి పోతానని, పాపం, అనవసరంగా అనుమానించి, ఎలాగైనా నన్ను యిక్కడే అట్టే పెట్టాలని, నా చేతులకి నా ప్రియమైన నరహరి బేడీలు వేయించాడు. అంతేనా నరహరీ!" అని దిలీప్ అతని వంక చూశాడు.

తోలుబొమ్మలాటలో ప్రయోక్త తాళ్లు లాగితే, బొమ్మ తల ఊపినట్లు నరహరి తల తాటించాడు.

"గుడ్! వెరీగుడ్! ఇప్పుడు వీళ్ళిచ్చే డబ్బు నేను రెండు చేతులా పుచ్చుకోవాలి కాబట్టి, నా చేతికున్న బేడీలు తొలగించుకున్నాను. నా సంస్థకి చైర్మన్ గారు నిన్ననే రెండువేల రూప్యాంబులు విరాళమిచ్చారు. ఇవాళ ఇంకొక మూడువేలు ఇస్తారట. ఏమండీ, ఘనత వహించిన రాజశేఖరంగారూ! మన్నించాలి. తమ పిన తండ్రిగారి కుమారరత్నం పేరు పొరపాటున పలి కాను... చంద్రశేఖరంగారూ ఇస్తారా?" అని దిలీప్ అడిగాడు.

"ఇస్తాను" అన్నాడు ముక్తసరిగా చంద్రశేఖరం. కన్నంలో తేలుకుట్టిన దొంగ, బాధ బయటకు చెప్పుకో లేదు.

"మరి ఇవ్వండి" అన్నాడు దిలీప్.

మారుమాట్లాడకుండా చైర్మన్ తన జేబులోంచి మూడువేల రూపాయిలుతీసి దిలీప్ కు యిచ్చాడు. వాటిని అతడు తీసుకొని లెక్కపెట్టి, "లెక్క సరిగాయింది. ధన్యవాదాలు. ఇచ్చిన డబ్బుకి ఇదుగో రసీదు" అని

ఒక త్రిశూలం గుర్తుగల కార్డుని ఇచ్చాడు. లోలోపల మండిపడుతున్నా మందహాసంతో, చైర్మన్ ఆ కార్డుని స్వీకరించాడు. ఇంగ్లీషు చిత్రాలలో కథానాయకుడు వంగి నమస్కరించినట్టు దిలీప్ నడుము దాకా వంగి, చేతిని పొత్తికడుపుదాకా సుతారంగా విసరి, నమస్కరించాడు.

"ఇక తరువాత మంచివాడు: శ్రీ పురుషోత్తంగారు. అయ్యా తమరు అయిదువేలు..." అన్నాడు దిలీప్.

"నా దగ్గర ఇప్పుడు డబ్బులేదు!" అన్నాడు పురుషోత్తం.

"ఆ సంగతి ముందుగానే మనకి తెలుసు. అందుకేగా తమ చేతనున్న వజ్రాల ఉంగరం ఇస్తామని తాము వాగ్దానం చేశారు" అన్నాడు దిలీప్.

"నేనేం వాగ్దానం...!" అని నసిగాడు పురుషోత్తం.

"చేయలేదు గాని, నేను నిన్న ఒక వాగ్దానం చేశాను. అది మీరు మరువరాదు. ఉంగరం ఇస్తే దాన్ని వేలం పెట్టి డబ్బు చేసుకొంటాను. సత్కార్య సమాజం ఆ వేలం జరిపిస్తున్నప్పుడు తమరే పదివేలకి పాడి, దానిని తీసుకొనవచ్చు" అన్నాడు దిలీప్.

పురుషోత్తం కటకటాయించాడు. తమ నాయకుడు చైర్మనే మారుమాటాడకుండా అడిగిన డబ్బు యిచ్చేశాడు. తనకి యివ్వాలని లేదు. ఏం చేయడం? పురుషోత్తం, చైర్మన్ వంక 'యిమ్మంటావా?' అని అడుగుతున్నట్టు చూశాడు. చైర్మన్ ముఖంలో ఏమాత్రం భావప్రకటన పురుషోత్తం చూడలేకపోయాడు.

"పురుషోత్తంగారూ! తమరు కాలయాపన చేస్తే లాభం లేదు. మన సమావేశానికి అధ్యక్షత వహించిన

సత్యనారాయణగారు చాలా పని తొందరలలో మునిగి తేలుతున్న ముఖ్య వ్యక్తి. వారిని అనవసరంగా శ్రమ పెట్టడంవల్ల చివరకి మీరే శ్రమకి లోనవ వచ్చు. దయ చేసి ఉంగరం..." అన్నాడు దిలీప్.

ఉంగరం ఆరువేలు ఖరీదు చేస్తుంది. దానివైపు చూస్తూ విధిలేక, తీసి దిలీప్‌కు దాన్ని పురుషోత్తం యిచ్చాడు. "అసందానంద కందళిత హృదయార విందు డనై దీనిని భారత ప్రజలందరి తరఫునా స్వీకరిస్తు న్నాను. ఇగునో రస్కీగు" అని దిలీప్ త్రిశూలం కొర్డుని పురుషోత్తానికిచ్చాడు.

ఆ తరువాత దిలీప్ నరహరి వంక తిరిగి, "ప్రియా! నీ అయిదు వేల రూపాయలు?" అన్నాడు.

"ఇనప్పెట్టెలో ఉంది. తీసుకొచ్చి యిస్తాను" అన్నాడు నరహరి.

'నీకెందుకా శ్రమ. తాళం యిస్తే నేనే తీసుకుం టాను' అని దిలీప్ అందామనుకున్నాడుగాని అలాగ చేయకూడదు. తాను నిర్బంధించి వీళ్ళదగ్గర డబ్బు తీసు కుంటున్నట్టు సత్యనారాయణ భావించకూడదు. కొబట్టి "తొందరగా తే ప్రియతమా." అన్నాడు దిలీప్.

నరహరి ఇనప్పెట్టె వద్దకు వెళ్ళినట్టే వెళ్లి, అందు లోంచి డబ్బు తీస్తున్నట్టు నటించి, పిస్తోలు తీసి చటు క్కున వెనుతిరిగి "హేండ్సప్" అని దానిని దిలీప్‌కు గురి పెట్టాడు.

"సత్యనారాయణగారూ! మీరు మరోలా భావించ కండి. నా వన్నెకాడు నాతో సరసమాడుతున్నాడు" అన్నాడు దిలీప్, చేతులను పైకెత్తి.

"డి. యస్. పి గారూ! నిజమేను" అని నరహరి గద్దించాడు.

"ఓరబ్బీ బంగారుసామీ! నాతో సరసమాడితే ఫరవాలేదుగాని, నిప్పుతోనూ, పోలీసు ఉద్యోగులతోనూ పరాచికం పనికిరాదు" అని దిలీప్ అనునయంగా చెప్పాడు.

"నరహరీ! ఏమిటిది?" అన్నాడు చంద్రశేఖరం.

"ఇదింతే! డి. యస్. పీ! చేతులెత్తు" అన్నాడు నరహరి. ఇంతవరకూ 'డి. యస్. పి. గారూ' అని మర్యాదగా సంబోధించిన వాడు ఇప్పుడా గౌరవ పదమైన 'గారు'ను విసర్జించినట్టే, తన ఇంగిత జ్ఞానాన్నీ, అపాయానికి లోనవుతాననే భయాన్నీ, నరహరి విసర్జించాడు.

సత్యనారాయణ చేతులు పైకెత్తాడు.

"మావాడు కొంచెం ఉద్రేకం మనిషి" అని చంద్రశేఖరం నచ్చచెప్పబోయాడు. కాని నరహరి, "ఉద్రేకం లేదు గిద్రేకం లేదు. ఈ లంజకొడుకు పోలీసువాణ్ని అడ్డం పెట్టుకొని డబ్బు గుంజుదామనుకుంటే, మనమేం దద్దమ్మలమా!" అన్నాడు.

"నరహరీ! నా తల్లికి అసత్య విశేషణం తగిలించవద్దని ముందే చెప్పాను. మళ్లా అదే పొరపాటు చేశావు. అందుకు ప్రతిఫలం త్వరలోనే అనుభవిస్తావు. ఇక పోలీసువాణ్ని అడ్డం పెట్టుకొని నేను మంచిపన్లు చేస్తున్నందుకు, నువ్వేం అభ్యంతరం చెప్పకూడదు. మీరు పోలీసువాణ్ని అడ్డం పెట్టుకొని చెడ్డపన్లు చేయబోయి విఫలులయ్యారు. మీ అడుగు జాడల్లోనే నేను మీరు అనుసరించిన పంథా అనుసరించి మంచి పనులు చేయాలనుకున్నాను. నువ్వు బుద్ధిమంతుళ్లాగ పిస్తోలు దించి డబ్బిచ్చేస్తే మంచిది. సత్యనారాయణగారికి జ్ఞాపకశక్తి హెచ్చయినా, ఈ సంఘటన మరచిపోతారు. ఏమంటే

నీవు పిస్తోలుతో బెదరించడం కేసు పెట్టదగినంత నేరం కాదు" అన్నాడు దిలీప్.

"బెదరింపులు కాదు. నిన్ను చంపెయ్యాలనే నిశ్చయించుకున్నాం, చంపేస్తాం. ఈ డి. యస్. పి. పిలవని పేరంటంగా వచ్చి సాక్షిగా ఉన్నాడు కాబట్టి, ఇతణ్నీ చంపేస్తాం" అన్నాడు నరహరి.

"తప్పు తప్పు! ఆయన పిలువని పేరంటంగా రాలేదు. నేను పిలిచాను. నా ఆహ్వానాన్ని మన్నించి ఆయన వచ్చాడు."

"వచ్చాడు కనుకనే చస్తాడు" అని నరహరి చెప్పి తన రౌడీలను చూసి, "వీళ్ళిద్దర్నీ కట్టెయ్యండి" అని ఆజ్ఞాపించాడు.

"కలత చెందకండి, సత్యనారాయణగారూ! కట్టుబడదాం. మీరూ నేనూ సాహసవంతులమే. గాని పిచ్చివాడి చేతిలోని పిస్తోలుని ధిక్కరించేటంత మొండివాళ్ళం కాము. మీ జేబులో పిస్తోలుంది. అది మీ హస్తాన్ని అలంకరించితే, మిమ్మల్ని ఆపేవాడు ఎవడూ లేడు. అయినా మీరు నా విన్నపాన్ని ఆలించి దాన్ని ధరించకండి. కట్టుబడండి, మీ ప్రాణానికొచ్చిన భయం లేదు. నా ప్రాణం అడ్డు వేస్తాను" అన్నాడు దిలీప్.

రంగయ్యలిద్దరూ దిలీప్‌నూ, సత్యనారాయణనూ, చెరో కుర్చీకి కట్టేశారు.

దిలీప్ నవ్వుతూనే ఉన్నాడు. సత్యనారాయణ గంభీరంగానే ఉన్నాడు.

"చావుకిన్ని చావుల్లేవు. నేను మరణించడానికి సంసిద్ధంగానే ఉన్నాను. అయితే నాసామి నరహరీ నీ దుర్మార్గపు పిస్తోలువల్ల చావను. నన్ను చంపినందుకు నువ్వు చావడం కూడా నాకు యిష్టం లేదు. ఇందాక నువ్వు పిస్తోలు పేల్చి చంపుతానంటే ఇన్‌స్పెక్టర్

సుబ్బారావు ఎందుకు వారించాడో, నీలాంటి మట్టి బుర్ర లకి అర్థం కాదు.

"పిస్తోలు గుళ్లుకూడా మాటాడగలవు. సాక్ష్యం చెప్పగలవు. నేను ఒకవేళ ఏ పిస్తోలు వల్లనైనా మరణిస్తే, నా శరీరంలో జొరబడ్డ గుండు ఏ పిస్తోలు వల్ల పేల్చబడిందో అపరాధ పరిశోధకులు అత్యంత సునాయాసంగా చెప్పగలరు. నీ పిస్తోలువల్ల నేను మరణించినట్టు చెడ్డపేరు కలకాలం రికార్డుల్లో ఉండడం నా కిష్టం లేదు. కనుక సత్యనారాయణగారి జేబులోని పిస్తోలు తీసుకొని దానితో నన్ను చంపు!" అన్నాడు దిలీప్.

'దొంగాడా! కరవకురా!' అని సామెత చెప్పినట్టు ఇతడు ఇలాగ ఎందుకు చెప్తున్నాడా? అని నరహరి అతని సహచరులూ ఆలోచించారు. ఇందులో ఏదో తిరకాసుందని వాళ్లు అనుకున్నారు. అయినా పోలీసు వాళ్ల పిస్తోలుతో చంపడమే మంచిదని భావించారు. దానికి దిలీప్ ప్రోద్బలం కూడా ఉంది.

'నా శరీరంలో పోలీసు పిస్తోలు గుళ్లుంటే, సత్యనారాయణగారే నన్ను చంపినట్టు తర్వాత పరిశోధకులు భావిస్తారు. మీరూ అలాగే చెప్పవచ్చు. మీరు ఎలాగూ సత్యనారాయణగారిని కూడా హత్యచేయ దలిచారు కాబట్టి, వారే నన్ను చంపారని అబద్ధం చెప్పినప్పుడు అడ్డు చెప్పడానికి ఆయన, అయితే గియితే సజీవంగా ఉండడు" అన్నాడు దిలీప్.

నరహరి ఆ పిస్తోలును తీసుకొని, గురిచూసి పేల్చబోయాడు. అంతలో దిలీప్ అతన్ని వారించాడు. "ఆగు ప్రియా! ఆగు. నిన్ను కొన్ని డజన్లసార్లు ప్రియా అని పిలిచినందుకైనా నీవు హంతకుడివవడం నాకు యిష్టం

లేదు. అందు చేత నన్ను కొల్చవద్దంటున్నానని పొరబడకు. ఒక హత్య చేసినా, నాలుగు హత్యలు చేసినా ఒక టే శిక్ష. అందు చేత రంగనాయకుల్ని చంపిన రాజశేఖరం ఇక్కడకి కొద్ది సేపట్లో రానున్నాడు కనుక, అతడి చేతి కిది యివ్వు" అన్నాడు దిలీప్.

"ఏమిటీ! మా బుచ్చి, రంగణ్ని చంపాడా?" అన్నాడు చైర్మన్.

"అవును" అన్నాడు దిలీప్, సత్యానారాయణవైపు చూస్తూ.

"వాళ్ళిద్దరూ దొంగ బంగారం పంచుకోవడంలో తగువులాడు కొన్నరా ఏమిటి?" అని పురుషోత్తం సందేహం వెలిబుచ్చాడు.

"అంగు కాదు. రంగనాయకులు పశ్చాత్తాపం చెంది పోలీసులకి అంతా విన్నవించుకో దలిచేటట్టు దేవతలు ఒక సంఘటన ఏర్పరిచారు. బుచ్చి రాక్షసుడై రంగ నాయకుల్ని చంపాడు కనుక అతడిచేతే మీరు మమ్మల్ని చంపించడానికి ప్రయత్నిస్తే ఉత్తరోత్రా మీకూ మంచిది" అన్నాడు దిలీప్.

"ఈ సలహా బాగానే ఉంది" అన్నాడు పురుషోత్తం. నరహరి కూడా ఆగాడు.

"హంతకులవారు వచ్చేదాకా మనం హాయిగా కాశీమజలీకథల్లాంటి కథలు చెప్పుకుందాం. ఈలోపున, ఎలాగూ చచ్చిపోయే వాళ్ళం కాబట్టి మా అంతిమ కోర్కెలు తీర్చండి" అన్నాడు దిలీప్.

చైర్మన్, పురుషోత్తం గతుక్కుమన్నారు - అంతిమ కోర్కె తీర్చమని ఆదిలో దిలీప్ పారిపోవడం వాళ్ళకి పరిచితమైన భయమే.

పురుషోత్తం వెటకారంగా "ఏమిటి నాయనా?

నీ అంతిమకోర్కె, సిగరెట్ కాల్చడమేనా ?'' అని అడిగాడు.

''అవును. ఆంధ్రదేశంలో వివిధ పొగాకు కంపెనీలున్నాయి. అందులో వేలకువేలు కార్మికులు పని చేస్తున్నారు. వాళ్లని తలచుకొని ఆఖరిసిగరెట్ కాలుస్తాను.''

''ఆఁ! తప్పించుకుపోదామనా ?'' అన్నాడు పురుషోత్తం.

''సిగరెట్ కాలిస్తే తప్పించుకుపోడమేమిటి?'' అని నరహరి ఆశ్చర్యంగా అడిగాడు.

ఈ గాథ మొదటి ప్రకరణం (త్రిశూలం మొదటి భాగం పేజీ 13) లో జరిగిన ఉదంతాన్ని పురుషోత్తం నరహరికి చెప్పాడు.

''అదా సంగతి. వాడి సిగరెట్ కాక, మన సిగరెట్టే ఇద్దాం. ఎలా తప్పించుకుపోతాడో చూద్దాం'' అని నరహరి ఒక సిగరెట్ తీసి, దిలీప్, నోట్లో పెట్టి వెలిగించాడు. దిలీప్ దమ్ములాగాడు.

''శుభం ! యింక కథలు చెప్పుకుందాం. ఇందులో పాత్రలు మాత్రం కేవలం కల్పితాలు కావు. పేర్లు, సన్నివేశాలు, సంఘటనలు అన్నీ జరిగినవే. విగత, సజీవ వ్యక్తులకి ఏ మాత్రం పోలికలున్నా అవి ఉద్దేశ్య పూర్వకమేగాని, యాదృచ్ఛికం కాదు. సత్యనారాయణ గారూ! వినండి'' అని దిలీప్, చైర్మన్ చంద్రశేఖరం తన అన్నగారికి విషమిచ్చి చంపడం మొదలు, తనను చంపించడానికి ఇన్‌స్పెక్టర్ సుబ్బారావుకి లంచం యివ్వడం దాకా చెప్పాడు.

చైర్మన్ మొగాన కత్తివేస్తే నెత్తురులేదు. కొన్ని సంఘటనలు తానుకూడా మరచిపోయినవి దిలీప్ జ్ఞాపకం చేశాడు. ఈ కథలో లీనమై చిక్కినవాళ్లందరూ ప్రపంచాన్నే మరచిపోయారు.

ఇక్కడ దిలీప్ సత్యనారాయణకు ఈ పాత గాధలు వినిపిస్తూన్నప్పుడే మేము మా పాఠకులకి బుచ్చి టెలిఫోను కింద పెట్టేసిన తరవాత ఏం చేసిందీ వినిపిస్తాము. అప్పుడు ఆ యింట ముగ్గురు వ్యక్తులున్నారని మొదటే చెప్పాము. తక్కిన యిద్దరూ బుచ్చి టెలిఫోను కింద పెట్టుతుండగా, అతను గాభరా చెందడం చూశారు. అతని ఉంపుడుకత్తె మల్లి పువ్వు "ఏమండీ, మీ అన్నగారేమైనా చెడ్డ కబురు చెప్పారా? మీరదోలా ఉన్నారు?" అని అడిగింది.

"తరవాత చెప్తా మల్లీ!" అని బుచ్చి, మురళీధర్ వంక తిరిగి "ఏం మురళీ? ఏమంటావు. నాకు ఇప్పుడాట్టే టైములేదు. నేను చెప్పిన డబ్బయితే వెంటనే యిచ్చేస్తా, పట్టుకు పోగువుగాని" అన్నాడు.

"సరే అలాగే యివ్వండి" అన్నాడు మురళీధర్, 'చచ్చినవాడి పెళ్లికి వచ్చిందే కట్నం' అనే భావనలో.

బుచ్చి డబ్బు లెక్కపెట్టి మురళికిచ్చి జకుక్కలదీవి ఆభరణాలు తీసుకొని పంపించివేశాడు. ఈ నగలని అతడు ఇనప్పెట్టెలో పెడుతూ, ఒక్కసారి ఆ పెట్టెలో నున్న బంగారాన్నీ, డబ్బునీ, విలువైన వజ్రాలనీ చూసి కళ్ల నీళ్లు పెట్టుకున్నాడు. ఈ ఆస్తినంతా పక్కనే ఉండి చూస్తున్న మల్లిపువ్వు మెదడులో కోరిక నోరూరింది.

బుచ్చిలాంటివాళ్లకి బంగారం, డబ్బు ప్రాణాల కన్నా ఎక్కువ. అందుకే ఈ ఆస్తిని కాపాడడానికే యింత కట్టుదిట్టమైన రాతిమేడ, కుక్క- కాపలా, గూర్ఖా పహరా మొదలైనవి ఏర్పాటుచేశాడు. రంగనాయకులింట్లో దొంగబంగారం కరిగించడమే తడవుగా తన వాటా తీసుకొచ్చి ఈ మేడలోనే భద్రం చేయడం ఇతని అలవాటు. ఇది మూడో కంటివాడికి తెలియదు.

(దిలీప్ మూడో కన్నుగల ముక్కంటిలాంటి వాడు కనుక అతనికి తెలిసింది.)

"మల్లీ! నాకోసం పోలీసులు వచ్చేటట్టున్నారు. అందుచేత నేను నాలుగు రోజులపాటు, అడవిలోని నరహరి బంగళాలో ఉంటాను. ఆ నాలుగురోజులు నువ్వు ఈ బంగారం అదీ చూస్తూఉండు!" అన్నాడు.

"మీరు చెప్పాలా? తప్పకుండా!" అంది మల్లి.

"నాకుమట్టుకు ఎవరున్నారు? నేను జైలుకెళ్లాక నావాళ్లంతా నన్ను విడిచి పెట్టేశారు, ఒక్క నువ్వు తప్ప..."

"ఆ విషయాలెందుకులెండి. నేను వీటిని చూస్తా."

"ఈ యింటికి బలమైనా కాపలా ఉంది. 'జానీ' నువ్వు చెప్పినట్టు చేస్తుంది. అలా చెయ్యమని నేను చెప్తా" అని బుచ్చి తన వేటకుక్కని పిలిచాడు. అతడు పిలవగానే ఆ దుష్టమృగం పిల్లిలాగవచ్చి అతడి ముందు నిలబడి తోక ఆడించింది.

"నేను నాలుగురోజులపాటు యిక్కడుండను. మల్లి ఏంచెప్తే అది చెయ్యాలి తెలుసా!" అని జానీకి బుచ్చి చెప్పాడు. వేటకుక్క తెలుసు అని తల ఊపింది.

బుచ్చి యింటి బయటకువచ్చి గూర్ఖాతో ఏదో చెప్పి వెళ్లిపోయాడు. మల్లిపువ్వు జానీకి గొలుసు కట్టింది.

ఇంక మనం ఈ పాత్రలను యిక్కడ విడిచి, అడవిలోని బంగళాకి వెళదాం. అక్కడ దిలీప్ నవరసభరితంగా, చైర్మన్ దుష్కృత్యాలని సత్యనారాయణకు వివరించి, "యిక రంగనాయకుల్ని హత్యచేసిన బుచ్చి కథ, అతడు బంగారం ఎలా దాచేదీ చెప్తాను" అని చెప్పాడు.

ఇంతలో అక్కడికి రాజశేఖరం వచ్చాడు. దిలీప్ "బుచ్చీ! విచ్చేశావా!" అన్నాడు. డి. యస్. పి. సత్యనారాయణ కుర్చీకి కట్లు బడడం చూసి బుచ్చి గతుక్కుమని, "అయితే ఇతను నన్ను పట్టుకోడానికే వచ్చాడన్నమాట!" అన్నాడు.

"అందుకు సందేహమా!" అన్నాడు దిలీప్.

"బుచ్చీ! వీళ్లని ఈ పిస్తోలుతో కాల్చి చంపెయ్" అని నరహరి పిస్తోలు అందించాడు.

అతను తీసుకొని తటాపటాయించాడు.

"ఎందుకాలోచిస్తావు. రంగనాయకుల్ని ఎలాగూ చంపావుగా!" అన్నాడు నరహరి.

"అవును. నిండా మునిగినవాడికి చావేమిటి" అని బుచ్చి పిస్తోలు గురిపెట్టాడు.

"ఉండుండు. ఇందాక మీ అన్నయ్యగారి కథ చెపుతూ, సిగరెట్ ఆరిపోయిందని మరచిపోయా! మరొక పీల్పు పీలుస్తాను" అని దిలీప్ తన జేబులోని అగ్గిపెట్టెని తీసి ఒక పుల్ల వెలిగించాడు. అతడు ఎప్పుడు తన చేతుల్ని కట్టునుంచి విడిపించుకొన్నదీ ఎవరూ గమనించనేలేరు.

అతడు అగ్గిపుల్లని వెలిగించి కింద పడవేయగానే, పోపుసామాను పొయ్యిలో పడితే అయ్యేచప్పుడు లాంటిది అయింది. హాలంతా పొగ క్రమ్మింది. అందరి కళ్ళంటా నీళ్ళొచ్చి అందరూ కళ్లు మూసుకున్నారు.

ఒక పూర్తి నిముషం పోయాకగాని పొగ చెదరలేదు. వాళ్ళ కళ్లు విడలేదు. దిలీప్ మసలివేషం వేసుకుంటూ, కళ్ళకి ఒక రకం సుర్మా పెట్టుకోనడం వల్ల ఈ పొగ అతని కళ్ళను ఏమాత్రం ఇబ్బందిపెట్ట లేదని ఇక్కడ మనవిచేయాలి. తక్కినవాళ్ళు తొక్కా

లికంగా నిముషం భరకూ గుడ్డివాళ్ళయినారు. వాళ్లు కళ్లు తెరచి చూసేసరికి బుచ్చి చేతికి బేడీలున్నవి.

సత్యనారాయణ కట్టు విడివడ్డమే కాక, అతని చేతిలో పిస్తోలుంది. వార్నింగు ఇచ్చాక కూడా, నరహరి ఏనోటితో దిలీప్ తల్లిని దూషించాడో ఆ నోట్లో నాలుగు ముందరి పళ్లూ కూడా ఈ ఒక్క నిముషంలో చాలా అకాలమరణానికి పాల్పడి కింద పడ్డాయి.

నరహరి ఏ అయిగు వేలు యివ్వడానికి నిరాకరించాడో,ఆ అయిదు వేలూ కూడా ఇనప్పెట్టె నుంచి నడచి వచ్చి దిలీప్ జేబులో కూర్చున్నాయి.

దిలీప్ జాడ ఎక్కడా కనబడలేదు.

తను గీచి పారవేసిన అగ్గిపుల్ల మాత్రం త్రిశూలం ఆకారంలో ఉంది.

# 6

డి. యస్. పి సత్యనారాయణ హంతకుణ్ణీ, చైర్మన్ బృందాన్నీ అరస్టు చేశాడనీ, అతని సిబ్బంది వచ్చి వాళ్లని తీసుకుపోయారనీ మేము వేరే చెప్పక్కర్లేదు. రంగనాయకులి హత్యకేసుకి సంబంధించినంతవరకు కథ కంచికి వెళ్లిపోయింది. మనం యింటికి కూడా వెళ్ళిపోవచ్చుగాని, కొన్ని విషయాలు తేల్చి చెప్పాలి. అవి చెప్పేస్తే ఈ గాథని ముగించి 'పవమానసుతుడు పట్టు' అని మంగళం పాడేయవచ్చు.

1. నిద్రనుంచి బయటకువచ్చాక సోములు—రంగనాయకులికీ, బుచ్చికీ వ్యాపార సంబంధముందని చెప్పాడు.

2. నౌఖరు రాముడు—తన అయ్యగారి ఇనప్పెట్టెలోంచి డబ్బు తస్కరించినట్టు ఒప్పుకున్నాడు.

3. ఇన్స్పెక్టర్ సుబ్బారావు—తాను కుట్ర పన్నినట్టు నిజం చెప్పేశాడు.

4. మాణిక్యం మంచి మార్గాన పడింది.

5. రాజారావు తన పెంపుడు తల్లి నగలు ఆమెకు సంతోషంగా సమర్పించాడు.

6. అతని పదివేలూ అతనికి ముట్టాయి.

7. జక్కలదీవి ఆభరణాలు చంచల యింట్లోనే పోలీసులకి దొరికాయి.

ఇప్పుడు మేము చెప్పిన అన్ని అంశాలూ ఆమోదించినా, మా పాఠకులు ఆఖరి విషయంలో అనుమానించవచ్చు. మురళీధర్ ఆ ఆభరణాలు బుచ్చికి అమ్మాడని, వాటిని బుచ్చి సురక్షితంగా ఉంచాడని చదివారు. ఆ యింటికి వేటకుక్క కాపలా ఉందని విన్నారు. ఇవి చంచల ఇంట్లోకి మళ్లా ఎలా వచ్చాయి? దిలీప్ తెచ్చాడని కూడా సునాయాసంగా ఊహించవచ్చు. అయితే భయంకరమైన వేటకుక్కని దిలీప్ ఎలా మచ్చిక చేసుకున్నదీ తరవాత చెప్తాం అని మొదటే మనవి చేశాం. అది చెప్పేసి ఈ కథ ముగిస్తాం.



ఈ కథలోనే ఒకచోట దిలీప్ 'రాణి' అనే తెల్లని ఆడ బొచ్చుకుక్కని పెంచుకున్నాడని చెప్పాం.

ఆ కుక్కని తీసుకెళ్లి దిలీప్, బుచ్చి యింటి ప్రహరీ గోడ ఎక్కించి లోనికి దింపేవాడు.

ప్రపంచంలో ఏ ప్రాణి కోటిలోనైనా ఆడజీవానికి, మగరాయుడు లోబడి విధ్యుక్తధర్మాన్ని విస్మరించడం సహజమే. మనిషైనా కుక్క అయినా ఈ విషయంలో సమానమే. రాణీని ప్రేమించిన వేటకుక్క యింటి కాపాలా విషయం మరచిపోతూ ఉంది.

ఇది, ఇంతకుముందు సాధకం నిమిత్తం దిలీప్ సాహసించి, బుచ్చి యింట్లోనికి ప్రవేశించాడని మనవి చేసామే - ఆ ఘట్టాల్లో. ఇప్పుడు దీనికి సులభమైన విధానంలోనే వేటకుక్కని మచ్చిక చేసుకొన దిలీప్ సంకల్పించాడు. దీనినే మేము వివరంగా విశద పరుస్తాము.

రాతిమేడ ముంగునున్న కర్రగుమ్మాలో గూర్ఖా, కూర్చొని 'కునికిపాట్లు పడదామా, మానుదామా' అన్న సంధిగ్ధావస్థలో ఉన్నాడు. అప్పుడక్కడ కొక అత్తరులమ్మే వ్యాపారి వచ్చాడు. గేటుదాటి లోనికి వెళ్లి, యింట్లోని మారాజులకి మారాజులాంటి సువాసన ద్రవ్యాలమ్మాలనే ఆసక్తి ఆ వ్యాపారికి ఈ షణ్మాత్రం లేకపోయినా, అటువంటి సదుద్దేశాన్ని ప్రదర్శించడం అతను మానలేకపోయాడు. వెనువెంటనే గూర్ఖా తన జన్మహక్కయిన ప్రజలను లోనికి పోకుండా వారించడమనే సత్క్రియను ఒనరించాడు.

"లోపల్కి పోవ-కూడ-దూ" అన్నాడు వచ్చీరాని తెలుగులో.

"అయ్యగార్కి- అత్తర్ ఇవ్వాలి" అన్నాడు వ్యాపారికూడా అదే బాణీ ఆంధ్రంలో.

ఈ అత్తరు వ్యాపారి మరెవరో కాదు; మారు

వేషంలో నున్న, మన కథానాయకుడేనని మా పాత్ర కులు ఈపాటికే పోల్చుకొని ఉంటారు.

అయ్యగారింట్లో లేడని దిలీప్‌కు తెలుసు. అయినా తనకీవిషయం తెలుసనే విషయం, గూర్ఖాకి తెలిసిన విషయంగా ఎందుకు చేయాలని, సహజంగా ఏ వ్యాపారైనా అడిగేటట్టు అడిగాడు.

"అయ్యగార్ని చూడా - డానీక్ - నీలు - లేడుః" అన్నాడు గూర్ఖా. బుచ్చి తన యింటినుంచి వెళ్లిపోతూ, తానుబయటకి వెళ్లినట్టు ఎవరికీ చెప్పవద్దనీ, యింట్లోనే ఉన్నట్టు చెప్పమనీ, గూర్ఖాకి చెప్పి మరీ వెళ్లాడు. అదే ఈ నమ్మినబంటు చెప్పడానికి ప్రయత్నిస్తున్నాడు.

"అయ్యాగార్కి అత్తర్ వద్దుః" అన్నాడు గూర్ఖా.

"అమ్మగార్కి ఇస్తా" అన్నాడు దిలీప్.

"మేమ్ సాబ్‌కీ భీ వద్దుః"

"అయితే నీకే యిస్తా" అని చెప్పి-అతడు అభ్యంతరం చెప్పే లోపునే, ఒక అత్తరు సీసా మూత తీసి, గూర్ఖా బెల్టునున్న రుమాలును పెకలించి తీసుకొని, దానికి అత్తరు అద్ది, ఆ రుమాలును గూర్ఖాయొక్క నాసికా పుటాలవద్ద సుతారంగా వింజామర వీచినట్టు దిలీప్ వీచాడు. సువాసన కమ్మగా ఉంది. మధురస సారాన్ని మలయానిలం మోసుకొచ్చినట్టుంది. ఆ 'చల్లని వైశ్రమం బుడుపజాలిన తామరపాకు వీవనల్' వంటి వీవనవల్ల గూర్ఖా తనగుమ్మాలో బల్లకి ఆనుకొని హాయిగా అయిదు నిముషాలు ఆదమరచి నిద్రపోయాడు.

దిలీప్ వాడిన అత్తరు, సువాసన కలుపబడిన క్లోరో ఫారమని, ఏ రసాయన పరిశోధకుడైనా యిట్టే పరీక్ష చేసి పోల్చుకోవచ్చు. అయితే ఈ సువాసన ద్రవ్యం కూడా ఒక రకం మత్తు పదార్థమే. దాని పేరు మేము

చెప్పడలుచుకున్నా, దిలీప్‌కు ఇష్టంలేదు. ఈ సువాసన ద్రవ్యం మధురస్మృతులను రేకెత్తించుగుంది. గూర్ఖా అయిదు నిముషాలు ఆదమరచి నిద్రపోయాడని చెప్పాము. ఆ అయిదు నిముషాలలోనే అతని మనస్సు హిమాలయ పర్వతశ్రేణిలోని తన స్వగ్రామానికి ఎగిరి పోయింది. అచ్చట, అతను పుట్టి పెరిగిన నాటనుండి, శృంగార జీవితం గడిపి, పొట్ట చేత్తో పట్టుకొని పర్వతాలుదాటి, సమతల ప్రదేశానికి చెక్కా రావడందాకా జరిగిన జీవిత విశేషాలలోని మచ్చుఘట్టాలు అతని మెదడులో ఎడిట్ చెయ్యని సినిమా చిత్రంలాగ కనబడ్డాయి. వీటితో మనకు సంబంధంలేదుగాని, ఈ అయిదు నిముషాలలో దిలీప్ అవిచ్ఛిన్నంగా ఆ యింట ఏం చేసినా గూర్ఖావల్ల అవాంతరం ఏర్పడకుండా ఉండడానికి యివి కారణభూతాలు కనుక, చెప్పాము.

గూర్ఖాకి నిద్రపట్టిన మరుక్షణంలో దిలీప్ సన్నని ఈలవేశాడు. తను తలపెట్టిన కార్యంలో మొదటి ఘట్టం జయప్రదంగా ముగిసిందనే విజయోత్సాహంతో వేసిన ఈలకాదు ఇది. అక్కడే నాయుగజాల దూరంలో కారులో సమయంకోసం వేచియుంటూ, ఈ ఈల కోసమే కాచుకొని ఉన్న రాణీ నిమిత్తమే ఈ సంజ్ఞను నోటితో దిలీప్ చేశాడు.

ఈల వినబడగానే రాణీ పరుగెత్తుకుంటూ వచ్చింది. దుష్టమానవులతో చెలగాట మాడడం దిలీప్‌కు ఎంత సరదాయో, వేటకుక్కలతో ఆటాడి, వాటిని ముప్పు తిప్పలూ పెట్టడం రాణీకి ఇష్టం.

రాణీ తన దగ్గరకు రాగానే "లోనికివెళ్ళి వేట కుక్కకి వెర్రెత్తించు" అని దిలీప్ గేటును తెరచాడు. వెళ్ళడం యిష్టంలేనట్టు రాణీ లోనికి వెళ్ళింది. ఈ జీవం

ఎందుకు తటపటాయిస్తున్నదో దిలీప్ వెంటనే పోల్చుకోలేకపోయాడు.

మానవులకన్నా కుక్కలు చాలా తెలివితేటలు గలవి. వాసనవల్ల దేనినైనా యిట్టే పసికట్టగలవు. తమకు యిష్టంలేని వాటినైనా యజమాని ఆజ్ఞాపిస్తే చక్కటి తరిఫీదుపొందిన కుక్కలు వెంటనే చేస్తాయి. అందుకే లోనికి వెళ్లడానికి తనకు మనస్కరించక పోయినా రాణీ వెళ్ళింది.

అది, తాను లోనికి వెళ్ళడం వృథాప్రయాస అని బయటనుంచే పోల్చుకొంది.

రాతిమేడ ఆవరణలో బుచ్చియొక్క పెంపుడు కుక్కగాని, మేడలో ఉంపుడుగత్తెగాని లేరు!!

మాడావుడిగా అడవిలోని బంగళాకి పోయేనిమిత్తం, బుచ్చి ఏర్పాట్లు చేసుకొని మల్లెపువ్వుకి అన్నీ అప్ప గించాడు. అతడు వెళ్లిన అయిదు నిముషాలలో మల్లె పువ్వు, ఆ యింట్లోనున్న బంగారాన్ని, జక్కులదీవి ఆభరణాలతో సహా ఒక పెట్టెలో పెట్టుకొని, వేట కుక్కకి గొలుసుకట్టి కారులో ఎక్కించి, ఈ సురక్షిత మైన రాతిమేడ ఎంతమాత్రం తనకు సురక్షితంకాదని భావించి, మరొకచోటుకి వెళ్లిపోయింది.

రాణీ లోనికి వెళ్లిన అరనిముషం ఆగి, దిలీప్ ఆవరణ లోనికి వెళ్లాడు. ఒక నిముషంపాటు యిల్లంతా గాలిం చాడు. ఏ జక్కులదీవి ఆభరణాలకోసం తాను యింత ప్రయాసపడి యిక్కడ కొచ్చాడో అవి యిక్కడ లేవన్న ఆశాభంగం అతణ్ని కోపోద్దీపుణ్ని చేసింది. మల్లెపువ్వుగానీ, వేటకుక్కగానీ యిక్కడ లేకపోతే అతని కొచ్చిన నష్టమేంలేదు. ఇప్పుడు మల్లెపువ్వు ఎక్క డకి పోయినదీ తెలుసుకొని ఆ ఆభరణాలు సంపాదిం చాలి. వాటిని తెల్లవారేలోపున చంచలయింట్లోచేర్చాలి.

మానాభిమానాలున్నవాడు తన ప్రాణం పోయినా సంతోషంగా వప్పుకొంటాడు గాని, మాట పోతే సహించలేడు.

"పద రాణీ!" అని అతడు యింటి బయటకు వచ్చాడు. "మల్లిపువ్వు మనకి వృధాప్రయాస కలిగించింది కనుక ఆ మెవద్దనుంచి జరిమానాగా కొంత డబ్బు మనం వసూలు చేయాలి" అని రాణికి దిలీప్ చెప్పాడు. నూరుగజాలదూరంలో ఏ కొరులో తన ఈలకోసం రాణీ మొదట వేచి గుంటుందో ఆ కొరువద్దకే దానిని పంపించివేశాడు. తాను గుమ్మోపద్దనే ఆగి, గూర్ఖాకి తెలివి వచ్చేదాకా ఆగాడు.

"అచ్చా హై! అత్తర్ బహుత్ అచ్చా హై" అన్నాడు గూర్ఖా, నిద్రలోంచ బయటపడి.

"అయ్యాగార్ని చూడ-డానిక్కి వీలులేనందుక్కి విచారము" అన్నాడు దిలీప్.

"ఆయన - ఇంట్లో-లేరుః రేపూ రా" అన్నాడు గూర్ఖా, తనకు యింత మంచి అత్తరు మచ్చు చూపినందుకు కృతజ్ఞతతో.

దిలీప్ ఏపనిచేసినా సక్రమంగా చేస్తాడు. తాను ఏ పనికోసం ఇక్కడకొచ్చాడో అది జరగదని తెలుసుకున్నాక వెళ్లిపోవచ్చు. గాని గూర్ఖావద్ద సెలవు తీసుకోడం మంచిది. వాడికి తెలివివచ్చాక, అత్తరు వ్యాపారి కన్పడకుండా లేకపోతే అనుమానించుతాడు. ఆ ఊళ్లోనున్న తక్కిలర గూర్ఖాలకి యిలాంటి అదృశ్య మనిష్యి అత్తరు వ్యాపారిగురించి చెప్తాడు. ఇక్కడ ఇంత విజయవంతంగా పారిన సాచిక ఉత్తరోత్రా ఇతర గూర్ఖాలవద్ద పారకపోవచ్చు. ఇప్పుడు రెండు మూడు నిముషాలు వృధాచేస్తే ముందు ముందు కొన్ని గంటలు జయప్రదం కావచ్చు.

మల్లిపువ్వు నిజంగా మల్లెపువ్వులాంటిదే. అసమాన మైనఅందగత్తె.ఆమె అంగాంగశోభని అతి కమనీయంగా మేము వర్ణించేవాళ్లమేగాని, ఈ గాథ చివరి ఘట్టంలో ఈ వర్ణన అనవసరమని తలపోసి, మానేస్తున్నాం. రాతి మేడనుంచి, బంగారంతోనూ, వేటకుక్కతోనూ నిష్క్రమించిన మల్లిపువ్వు, తన అన్నగారింటికి వెళ్లిపోయింది. ఆ యింటి ముందు వేటకుక్కని కట్టేసింది. ఆ యింటి పెరట్లో బంగారం పాతి పెట్టేసింది.

మల్లెపూవు ఎక్కడికి వెళ్లినదీ తెలుసుకోవాలనే ప్రయత్నంలో దిలీప్, ఈ యింటివద్దకొచ్చాడు. కట్టి వేయబడిన వేటకుక్క ఆనవాలవల్ల మల్లిపువ్వు యిక్కడకే వచ్చిందని దిలీప్ భావించాడు. అంతలోనే ఆ యింటి అద్దాల కిటికీలోంచి మల్లెపువ్వు ఆకారం కూడా అతనికి కనబడింది. 'రాణీ! నువ్వు కారులోనే ఉండు' అని చెప్పి దిలీప్ ఆ యింట్లోకి ప్రవేశించాడు. ప్రస్తుతం ఆ యింట్లో మల్లెపువ్వు ఒకత్తే ఉంటున్నది.

"మల్లీ! మల్లీ నిన్ను కలుసుకుంటా ననుకోలేదు. ఇక మళ్లా మల్లీ కలుసుకోను కూడా. నేను నీ అందాన్ని చూసి ఆనందించడానికి రాలేదు. మురళీధర్ అనే మూర్ఖుడు, నీ మాజీ దగుల్బాజీ భర్తకి కొన్ని ఆభరణాలు అమ్మాడు. సదరు ఆభరణాలను నేను ఉచితంగా తీసుకెళ్లడమే సముచితం. అవి యిచ్చి పంపించు" అన్నాడు దిలీప్.

'ఈ అత్తరు వ్యాపారి ఇలా మాట్లాడుతున్నాడేమిటి?' అని మల్లెపూవు ఆశ్చర్యం చెందింది. అయితే దానితో దిలీప్‌కుగాని మనకుగాని ఏం సంబంధం. లేదు. అతను ఒకే ఒక నిశ్చయంతో వచ్చాడు. ఆ ఆభరణాలను నయానో, భయానో పుచ్చుకోడం అతని ఆదర్శం. ఇవ్వకూడదనేది ఆమె సంకల్పం. అతడు తన

పట్టుదల పీడలేదు. ఆమె మెత్తబడనూలేదు.

వీళ్ళిద్దరూ ఇలా ఘర్షణపడుతూ ఉండగా బయట కట్టివేయబడిన వేటకుక్క మొరుగుతూ గొలుసు తెంపుకొనే ప్రయత్నంలో ఉంది. మల్లిపువ్వ 'జానీ! జానీ!' అని కుక్క యొక్క సహాయాన్ని అర్థించడమే అందుకు కారణం.

ఆభరణాలను సంగ్రహించి పడ్డ కష్టానికి ప్రతి ఫలంగా ఒక్క వెయ్యి రూపాయలు తీసుకొని అతి విజయవంతంగా దిలీప్ ఆ యింటి బయటకు వచ్చేలోగా వేటకుక్క గొలుసు తెంపుకుంది. ఒక్క దూకులో అది దిలీప్ మీద పడ్డది. అతడు దానితో కలియబడ లేదు. ఆ భయంకర శ్వానం అతణ్ని కరచి, ఏ కండ కండకా కండ పీకి పారేసే లోపున దిలీప్ సన్నని ఈల వేశాడు. రాణీ వచ్చింది. రాణీని చూడగానే జానీ ఉగ్రస్వరూపం, సమగ్రంగా మారి చల్లారిపోయింది.

చిరునవ్వులు నవ్వుకుంటూ దిలీప్ తన కారు ఎక్కి స్టార్టు చేశాడు. రాణీ చెంగున వచ్చి అతని పక్క చూచింది. వేట కుక్క కూడా వచ్చేలోగా కారు రివ్వున వెళ్ళిపోయింది. మల్లెపూవు నిశ్చేష్టితురాలయిందనీ, వేటకుక్క విరహంలో పడ్డదనీ టూకీగా తేల్చి చెప్పేస్తున్నాం.

తరువాత ఏం జరిగిందంటే :

జక్కులదీవి ఆభరణాలను చంచల యింట్లో తిరిగీ పెట్టి, దిలీప్ తాను సత్యనారాయణకు చెప్పిన సమాచారం సత్యమని ఋజువు చేసుకున్నాడు. అతడు చేసిన సాహసాల్లో ఇది అతి సాధారణమైనది.

అతని తదితర సాహసాలు ఆంధ్ర పాఠక లోకానికి చెప్పాలనుకుంటున్నాం గాని గురదృష్టవశాత్తూ ఇదే ఈ విధమైన మా ఆఖరి డిటెక్టివ్ రచన.

సంపూర్ణం.